Telugu Classics - Popular Edition Series

శ్రీ

# శ్రీమహాభారతము

## (భీష్మ పర్వము)

సంపాదకులు

డాక్టర్. కేతవరపు వేంకట రామకోటిశాస్త్రి




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ — సైఫాబాద్ — హైదరాబాదు-4

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి తెలుగుభాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలె నని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథ సముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈ లోటును తీర్చి ప్రాచీనగ్రంథసంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్య అకాడమి ఒక ప్రణాళికను సిద్ధము చేసినది. ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాలప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కర రామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట; పై ప్రణాళిక ప్రకారము ప్రచురింపబడు ప్రతి గ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈ కార్యక్రమములో ప్రాచీన ప్రబంధాల ప్రకటనము పూర్తియైనది. సంక్షిప్త గ్రంథ ప్రచురణ కార్యక్రమములో బసవపురాణ, భాస్కరరామాయణ, హరివంశ, భోజరాజీయములు ప్రచురింపబడినవి. ప్రస్తుతము ఆంధ్ర–మహాభారత ప్రకటనము చేపట్టనైనది. ప్రసిద్ధులైన విద్వాంసులచే మహాభారత సంపుటముల పరిష్కారము నిర్వహింపబడుచున్నది.

ఆంధ్ర మహాభారత సంపుటములలో ఆరవదైన భీష్మ పర్వమును పరిష్కరించి, పీఠిక వెలయించి మా కందజేసిన డాక్టర్ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రిగారికి అకాడమి పక్షాన కృతజ్ఞతలు.

పైన పేర్కొనబడిన గ్రంథ సంపుటాల వ్రాతప్రతులను సిద్ధము చేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వాగ్దానము గావించి అందులో చాలమట్టుకు డబ్బును విడుదలకూడ చేసినవి. అందుకు అకాడమి పక్షాన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు ధన్యవాదాలు. సాధ్యమైనంత త్వరలో మహాభారత సంపుటముల నన్నింటిని సిద్ధము చేసి, ఆంధ్రపాఠకలోకానికి అందజేయుట జరుగగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు,
20–11–71.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# విషయసూచిక

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము

## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము



## భీష్మపర్వము - తృతీయాశ్వాసము

# ఉపోద్ఘాతము

## వ్యాసభట్టారకుడు

శ్రీమన్నారాయణుడే వ్యాసభట్టారకుడుగా అవతరించెను. భగవంతుడు ధర్మసంస్థాపనార్థ మప్పుడప్పు డవతరించుట కద్దు. ధర్మ సంస్థాపనము కొరకే వ్యాసుడు మహాభారతమును రచించెను. ఇంత మహాభారతమును రచించుటచేతనే ఆయన భగవంతుడై యుండునను విశ్వాసము పరివ్యాప్తమైనది. అంత పరమాశ్చర్యకరమైన బుద్ధివైభవము భగవంతుడు తప్ప అన్యము కాదు. మహాభారతము పంచమవేదము. అనాదులైన ఋగ్యజుస్సామాధర్వణ వేదములు నాల్గును భగవన్ముఖ నిర్గతములు. అందువలన వ్యాసుడు భగవంతుడే కావలయును. కానిచో ఇట్లింతటి లోకహితనిష్ఠాపరు డగుట కాతని కేమిపట్టినది? ఆతని బుద్ధి ఆగమ విధాన నిధానము. యోగ సాంఖ్యము లతని మనస్సు నుండి సముదితములైనవి. ఆగమ విధానమంతయును యజ్ఞయాగాది కర్మ లక్షణము. యోగసాంఖ్యము లవి రెండు పృథగ్విషయములు కావు. ఒకటి జ్ఞానము యొక్క మొదలు. రెండవది దాని తుది. వ్యాసుడు కర్మజ్ఞానైక మూర్తి. భగవంతు డవతరించినప్పు డట్లే యుండును. ఆపనుల నిమిత్తమే భగవంతు డవతరించును. ధర్మ సంస్థాపన మనగా కర్మజ్ఞానములను సక్రమముచేసి నెలకొల్పుటయే. కర్మ జ్ఞానములకు ధర్మ రూపమున అద్వైతము సిద్ధించును. మరియు ధర్మ మనగా కర్మ. అద్వైతము జ్ఞానము. ధర్మాద్వైత స్థితి యనగా కర్మజ్ఞానముల యునికి. వ్యాసు డాయునికివాడు. మహాభారత మాయునికి కలది. లోకమును ద్వివిధానిష్ఠము—జ్ఞానయోగము నందును, కర్మ యోగమునందును. లోకమును వలెనే మహాభారతము. లోకము ననుసరించియే వ్యాసుడు. సమాజమువల్లనే లోకము. తానున్న మహాభారత సమాజమునందు వ్యాసభట్టారకుడు తన బాధ్యతను సంపూర్ణముగా నిర్వహించి చేతులు కడుగుకొనెను. భవ్య కవితావేశ మనగా నట్లు కడుగు

కొనుటయే. మౌసల పర్వము చూచినచో భగవదావేశము పర్యవసానము లక్షణము తెలియును. భవ్యకవితావేశము గల కవి సమాజమున కట్లు బాధ్యత వహించును. సమాజము కర్మజ్ఞానాత్మకము. వ్యాసుడు దానినే ప్రబోధించెను. మహాభారత మనగా అది.

## మహాభారతము

ధర్మార్థకామమోక్షములు పురుషార్థములు. వీనిని సాధించిపెట్టుటకు మహాభారత మవతరించినది. వేదములు - స్మృతులు - పురాణములు-అన్నియును పురుషార్థ సిద్ధిని వివరించి చెప్పు తాత్పర్యము కలవియే. ఆయావిషయ నిరూపణములయం దవి ఎక్కడేని పరస్పరము విరోధింపవచ్చును. అట్టి చోట్ల ఆ విరోధమును పరిష్కరించుటకు తగిన ప్రామాణ్యబలము మహాభారతమున కున్నది. మనుస్మృతిమీద మేధాతిథి వ్యాఖ్య కలదు. ఆ వ్యాఖ్యానము చాల చోట్ల మహాభారత శ్లోకములను ప్రమాణముకొరకు కుద్ధరించి చూపినది. మనుస్మృతియందును మహాభారతమునందును కొన్ని వందల శ్లోకములు కొద్దిగనో, గొప్పగనో సమానముగా నున్నవి.[1] మరియు తంత్ర వార్తికమునందు కుమారిలభట్టును, న్యాయవార్తికమునందు ఉద్యోతకారుడును, మహాభారతమునుండి శ్లోకముల నుదాహరించియే విశేషవ్యాఖ్య చేసిరి. పతంజలి యోగభాష్యమునందుకూడ మహాభారత వాక్యములు ప్రమాణములుగా ఉదాహరింపబడినవి.[2] శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు ఛాందోగ్యము, బృహదారణ్యకము మొదలైన ఉపనిషత్తులకు భాష్యము వ్రాయుచు మహాభారతమునుండి ప్రమాణవాక్యముల నుద్ధరించుకొనెను. శ్రీమద్భగవద్గీతాభాష్యమునందును మహాభారతవాక్యము లుద్ధరింపబడుటను మనము గుర్తింపవచ్చును. మరియు బ్రహ్మసూత్ర భాష్యమున శ్రీమచ్ఛంకర భగవత్పాదులు వేదాంత సూత్రార్థమును సమర్థించుటకు మహాభారతమునుండి వాక్యముల నుద్ధరించి సమన్వయపరచిన తావులు చాల యున్నవి.[3] మహా

1. A. B. R. (Annals of the Bhandarkar Oriental Research Institute, Poona.) Vol. XLVII. Parts I—IV. Page 33.
2. A. B. R. Vol. XIX, Part II. Pages 161—172.
3. A. B. R. XIX, Part II. Page 164.

భారతము వేదాంతసూత్రములకంటె ముందటి గ్రంథముగా శ్రీమద్భగవత్పా దులు భావించిరి. పూర్వమీమాంసాసూత్ర భాష్యమున శ్రీ శబరాచార్యులును మహాభారతమునుండి ప్రమాణవాక్యముల నుద్ధరించుకొనెను.[4]

లోకమున ధర్మార్థములు కలిసిపోవు. కామమోక్షములును పోవు. అంతే కాదు. అవి పరస్పరము విరోధము కలవిగా కూడ నున్నవి. తద్వి రోధమును పరిహరించి సమాజమున కీ నాల్గుపురుషార్థములును కడు ప్రాధా న్యము కలవిగా చూపించుటకు మహాభారతము నడుము కట్టెను. అందుకే దాని విషయమున అంతటి ప్రామాణ్యబుద్ధి ప్రబలినది. పురుషార్థములన్న మాటయే చిత్రమైనది. శరీరమునం దుండువానిచేత కోరబడునవి మరియు ప్రార్థింపబడునవి అవి. శరీరమునం దుండువాడు శరీర ధర్మములను కల వాడు. ఈ ఉపాధివల్లనే అర్థకామములు కోరబడుచున్నవి. అవి దుఃఖమును గొనివచ్చుచున్నవి. శరీరమునం దుండువాడు దుఃఖ మలవాటులేనివాడు. వాని కాదుఃఖమునుండి మోక్షము కావలయును. కామమునుండి మోక్షబుద్ధి పుట్టుటకు వీలున్నది. అర్థమునుండి ధర్మబుద్ధి పుట్టదు. అందుకని లోకహితకాములు ధర్మమునుండి అర్థములను పురుషార్థముగా చెప్పిరి. సమాజము దేనిని కోరును? ధనమును కోరును. ఒకని నెందుకు ప్రార్థించును? ధనమునని ప్రార్థించును. కోరిక లీరికలెత్తు స్వభావము కలవి. ప్రార్థన యాచనాదైన్యమును తెచ్చునది. ప్రజ లా విధముగా దీనులు కాకుండుటకై ముందు ధర్మమును బోధించిరి. అర్థ కామములు మానవులకు తెలియును. తెలియనిది ధర్మము. మరియు మోక్షము. ధర్మము కర్మ. మోక్షము జ్ఞానము. కర్మజ్ఞానములు ప్రవృత్తిరూపములైన అర్థకామములను పాలించుట విశ్వశ్రేయము దృష్ట్యా అవసరము. ఆ యవసరమును తీర్చుటకే మహా భారతము రచింపబడినది.

సమాజమునకు ధర్మము కవచము. ఆ కవచమును రక్షించినచో అది మనలను రక్షించును. ధర్మరక్షణభారము నెందరు ఋషులు వహించిరో చెప్పలేము. ఇప్పటికి మనకు తెలియవచ్చుచున్నవారే మను - విష్ణు - యమ - అంగిర - వసిష్ఠ - దక్ష - సంవర్తన - శాతాతప - పరాశర - గౌతమ - శంఖలిఖిత - హారీత - ఆపస్తంబ - ఉశన - వ్యాస - యాజ్ఞవల్క్య -

4. A. B. R. Vol. XLVII, Parts I—IV. Page 16.

కాత్యాయన - బృహస్పతి - దేవల - నారద - పైఠీనస— ఈ మొదలుగా ఇరువదిమందికి పైగా కలరు. వీరందరు సమాజకవచమును యథాశక్తి రక్షించుటకు పాటుపడ్డవారే.

ధర్మ మనగా నేమి? ఏమి చెప్పిన ధర్మము చెప్పిన ట్లగును? ప్రజకు ముందు ధైర్యము కావలయును. ఓర్పు కావలయును. వారు ఏ రూపము గాను దొంగతనమునందు ప్రవర్తింపరాదు. సమాజము రోగములతో తీసి కొనరాదు. ఇంద్రియనిగ్రహము నలవాటుచేయవలయును. విషయవిచారణ చేయు బుద్ధిపాటవము ముఖ్యము. సత్యమునకు దూరమై సమాజము పోకూడదు. సమాజ మిట్లు సంపూర్ణముగా వికసించియుండుటను ప్రబోధించి నచో ధర్మమును ప్రబోధించినట్లు. మరియు హింసాప్రవృత్తి ప్రజల కలవాటు కారాదు. క్రోధము మంచిది కాదు. దయాదాక్షిణ్యములు మానవత్వ లక్షణ ములు. అవి భద్రముగా కాపాడుకోవలసినవి. శమదమాదు లెంత ముఖ్యమో కుటిలప్రవృత్తి లేకపోవుట అంతకంటె ముఖ్యము. ఆయా విషయములను ప్రబోధించినచో ధర్మ ప్రబోధము జరిగినట్లు. ఇంతమాత్రముతో సరిపోదు. ఇందుకు విరుద్ధమైన అధర్మప్రవృత్తిని నిర్ద్వంద్వముగా ఖండించివేయ వలయును. అదియును ధర్మప్రబోధములోని భాగమే. ఇంతకును ఈ ధర్మ ప్రబోధ మెందుకు? ఎందుకనగా లోకప్రవృత్తి సక్రమముగా నుండుటకు. లోకప్రవృత్తి అభ్యుదయమార్గమును వీడకుండుటయే సక్రమముగా నుండుట. ఆ మార్గమును వీడకుండుటయే లోకమునకు కావలసినది. అదే దానికి శ్రేయము. విశ్వశ్రేయము నెరిగి ప్రవర్తించుటయే లోకజ్ఞత్వము! మహాభారతము లోకజ్ఞ త్వమును పుక్కిలించుచున్నది. అది ధర్మశాస్త్రము. అర్థశాస్త్రము. కామ శాస్త్రము. మోక్షశాస్త్రము. ఈ చతుర్విధపురుషార్థములనుగురించి ఇందు చెప్పబడిన విషయములే తరువాత తరువాత వాఙ్మయమునందు బహుధా వెలసి నవి. ఇందు లేని వందును లేవు అందువల్లనే సాంగములైన వేదములు-అష్టా దశ మహాపురాణములు—అన్ని ధర్మశాస్త్రములు—ఈ మొత్తముతో ఒక్క మహాభారతము సమానముగా చెప్పబడుచు వచ్చుచున్నది. పురాణకర్తలు కూడ మహాభారతమును ఖనిగ్రంథముగా గౌరవించిరి. వైష్ణవపురాణములు మహాభారతమునకు చాల ఋణపడియున్నవి. శ్రీకృష్ణుడు విష్ణ్వవతారముగా మహాభారతమునను, హరివంశమునను నిరూపింపబడియుండుటను చూచి

ఆయా పురాణము లింకను మహనీయముగా రచింపబడినవి. మరియు కాళిదాసాది మహాకవులకు కావ్యవస్తువు నందించినది మహాభారతము. ఇక దేశభాషా కవుల విషయమున అది కామధేను వనియే చెప్పవలయును.

భారత ఉపఖండము భౌగోళికముగా ఎంత విచిత్రమైనదో సాంస్కృతికముగా కూడ అంత చిత్రమైనది. ప్రపంచమున చాల దేశముల సంస్కృతులు నాగరకతలు నశించిపోయినవి. గ్రీసు—రోములు కనిపించుచున్నవి కదా! రాజకీయముగా ఛిన్నాభిన్నమయ్యును సాంస్కృతికముగా మన దేశము ఆసేతుహిమాచలమును ఏకాకృతిగనే ఉన్నది. అట్లుండునట్లు పునాదులు గట్టిగా వేసిన మహర్షులు వ్యాసవాల్మీకులు. ఆ జాతీయమహాకవులు గానము చేసిన కావ్యము లిప్పుడును భారతీయులను ఆబాలగోపాలముగా నలరించుచున్నవి. ఇన్ని వందలసంవత్సరములుగా భారతీయుల నిత్యజీవితమున ఆలోచనావిధానమును సరిదిద్దుచు వచ్చుచున్న మహేతిహాసము మహాభారతము. హోమరు చేసిపోయినదాని ఫలితము ఆదేశీయులం దింకను కనిపించుచున్నదో లేదో చెప్పలేము. కాని వ్యాసుడు తన భవ్యకవితావేశమును మహాభారతముగా ఆవిష్కరించి భారతీయుల రక్తమాంసములుగా దానిని పరిణమింపజేసెను. మహాభారత మావిధముగా భారతజాతి నరమునకు పట్టియున్నది. మనము కర్మవాదులము. ఆమాట ఇప్పు డంత మంచిగా కనిపించుటలేదు. మానవులందరును కార్మికులు. కర్మ చేయవలె. తగిన ఫలము ననుభవింపవలె. నేను కర్మ చేయ ననుటకు మానవునకు హక్కు లేదు. ఈ సత్యమునే మహాభారతము బోధించినది. మరియు నీకు రావలసిన వాటాను నీవు వదలుకొనరాదు. అందుకు నీవు తిరుగబడితీరవలయును. నీది కానిదానిని నీవు కోరరాదు. అది నీ పతనహేతువు. ధర్మరాజున కెన్ని ధర్మములు తెలియును? ఆయన ఎంత శాంతమూర్తి? తన వాటాకొరకాయన యుద్ధము చేయవలసి వచ్చినప్పుడు చేయనే చేసెను. అందరి వాటాలను తానే అనుభవింపవలయు ననుకొన్న దుర్యోధనుని తొడలు విరుగగొట్టి పడగొట్టుటకు ధర్మరాజు వెనుకాడలేదు. అందుకే మానవజాతికి ధర్మరాజు ఆదర్శము. దుర్యోధనుడు కాదు. మహాభారతకథ ఏమి బోధించుచున్నది? సామాజికుడైన మానవుని యందు చైతన్యమును బోధించుచున్నది. ఆ మహేతిహాస మిన్నివందలసంవత్సరములు ప్రజల కతిసన్నిహితముగా బ్రతుకగలుగుట కదియే హేతువు.

శ్రామికులు బుద్ధి జీవులు ఎప్పుడును బానిసలు కారు. వారు కర్మ యోగులు, జ్ఞాన యోగులు. మానవజాతి ఏ రాజకీయ సిద్ధాంతవాదము బలము నీడను పరిపాలింపబడినను కర్మ చేయక తప్పదు-ఫలము ననుభవింపక తప్పదు. జ్ఞానమును పొందక తప్పదు. ఈ పరమార్థమునే మహా భారతము బహువిధములుగా ప్రతిపాదించినది. మానవుడు చేయు కర్మలలో శ్రేష్ఠమైనది యుద్ధము. యుద్ధము మానవజాతికి స్వధర్మము. యుద్ధము యుద్ధము కొరకు కాదు. ధర్మసముద్ధరణముకొరకు. అప్పుడే భగవంతు డవతరించును. మనలో నీవు నేను అని లేము. మనమంతా ఒకటి. ఇది జ్ఞానము. ఇంతకంటె సుఖము లేదు. ఈ విధముగా కర్మజ్ఞానముల విషయమును లోకహిత నిష్ఠతో వ్యాసుడు భవ్యకవితావేశమును తెచ్చుకొని ప్రవచించెను. మహా భారత మట్లు సిద్ధమైనది. మహాభారతము మనుష్యుల కొరకు. "యద్యదాత్మాని చేచ్ఛేత తత్పరస్యాపి చింతయేత్" నీవు నీకేమి కావలె నని కోరుకొందువో దానిని ఇతరులకొరకుకూడ కోరుకొనుము. ఇది సార్వకాలికమైన దాని ప్రబోధము.

## భారతయుద్ధము

మానవజాతిచరిత్రలో యుద్ధము లెందుకు జరుగుచున్నవో మహాభారత యుద్ధమును అందుకే జరిగినది. యుద్ధము లెప్పుడును ద్వేషమూలములు. కౌరవులకు పాండవులయందు ద్వేషము పుట్టినది. బడిచదువుల ఈడునుండియే దుర్యోధనునకు పాండవులతో పడలేదు. చదువులలో పాండవు లించుక చురుకు. కౌరవులు కొంచెముమందము. తాము స్థానికులు. పాండవు లెత్తి వచ్చిన వారు. తాము చక్రవర్తి బిడ్డలు. పాండవులు చక్రవర్తి తమ్ముని-చనిపోయిన వాని-బిడ్డలు. రాజ్యము తమది. రాజకుమారులకంటె అన్యులు అన్నింటిలోను తగ్గియే యుండవలయును. తమకంటె చదువులో పాండవులు ముందుకు పోరాదు. వారు పోవుచున్నారు. అది తమ కవమానము. పాండవులు తమ నవమానించుచున్నారు. దానిని సహించి తా మూరుకొనరాదు. వారి నంతకంటె అవమానముపాలుచేసి తమ ఆధిక్యమును తాము నిలబెట్టుకొనవలయును. మనస్సులో ఈ విధముగా దుర్యోధను డాలోచించుటకు మొదలు పెట్టెను. చిలికి చిలికి గాలివాన యైనది. మహాభారతయుద్ధము జరిగెను. ధర్మపక్షము జయించెను.

మహాభారత యుద్ధమే యుద్ధము. అదే భారతము. దానికి ముందున్న దంతయు అది యగుటకు కావలసిన ప్రాతిపదిక. దానికి తరువాత ఉన్న దంతయు ఇక దాని పరిణామము. ఈ విధముగా యుద్ధము మంచి కీలక స్థానమునం దున్నది. పదునెనిమిది దినములు పదునొకండక్షౌహిణుల సైన్యముతో ఏడక్షౌహిణులు ఐదుగురు సేనాపతులతో ఒక సేనాపతి తలపడి చేసిన మహాయుద్ధ మది. అది భీష్మ—ద్రోణ—కర్ణ-శల్య—సౌప్తిక పర్వముల మీద పరచబడి వర్ణింపబడినది. మొదటి నాల్గుపర్వముల కున్న పేర్లు కౌరవ సర్వసేనాధిపతులవి. సౌప్తికపర్వమున అశ్వత్థామ కౌరవసేనాధిపతి. పాండవపక్షసైన్యములకు సేనాపతిత్వమునకు పూని తుదిదాక నడపినది ధృష్టద్యుమ్నుడు. ఆయన ద్రౌపదికి అన్నగారు. సౌప్తికపర్వమున అశ్వత్థామ వానిని పశువును చంపినట్లు చంపినాడు.

ఈ మహాభారతయుద్ధ మెప్పుడు జరిగినదియు కచ్చితముగా చెప్పుట కవకాశము లేదు. అందువలన భిన్నాభిప్రాయములు వెలువడినవి. ఇతిహాసమునందలి వస్తువు—యుద్ధము— చారిత్రక సత్యమై యుండుననుటనుబట్టి భారతయుద్ధము జరిగిన కాలమును చారిత్రకముగా నిరూపించుటకు చాలమంది ప్రయత్నము చేసిరి. శ్రీ కె.వి. అభయంకర్‌గారు ఖగోళ శాస్త్రమును పట్టుకొని జ్యోతిర్వేదము ననుసరించుచు మహాభారత యుద్ధము సరిగా సంవత్సరమును మాత్రమును చెప్పుటకు వీలుకాక మార్గశీర్ష శుక్ల త్రయోదశి రోహిణీ నక్షత్రమున మొదలైన దనియు, మార్గశీర్ష కృష్ణ చతుర్దశి సాయంకాలమునకు ముగిసిన దనియు వ్రాసిరి.[5] మహాభారత యుద్ధము బహుశః క్రీస్తు పూర్వము మూడువేల సంవత్సరములనాడు జరిగియుండవచ్చును. అప్పటినుండియే కలియుగము మొదలైనది. శ్రీ పి. ఆర్. చిదంబర అయ్యరుగారును ఈ విధముగానే లెక్కచేసి మహాభారతయుద్ధము కలియుగము ప్రవేశించిన తరువాత అరువదియైదు సంవత్సరములకు క్రీస్తుకు పూర్వము మూడువేల ముప్పదియెనిమిది సంవత్సరములనాడు జరిగియుండునని వ్రాసిరి.[6] ఈ విషయమున ఏకాభిప్రాయము వచ్చుటకు వీలులేదు. ప్రాచ్యపాశ్చాత్య విమర్శక విద్వాంసులుభయులయందును ఈ విషయమున ఏ ఇద్దరికిని పొత్తు లేదు.[7]

---

5. A. B. R. XXV, Parts I, II, III. Page 133.
6. A. B. R. XXVIII, Parts I, II. Page 83.
7. A Mahabbharata Primer, Pages 20—29 and A. B. R. XLVII, Parts I—IV. Pages 20—29.

ఒకరు మహాభారతయుద్ధము క్రీస్తు పూర్వము పదుమూడవ శతాబ్ద మున జరిగిన దందురు. ఇంకొకరు ఇరువదియవ శతాబ్ద మందురు. మరొకరు పదిహేను పదహారు శతాబ్దములు—వేరొకరు పన్నెండవ శతాబ్దము—ఇంకొకరు క్రీస్తుపూర్వము ముప్పది రెండవ శతాబ్దము—ఇది ప్రాచ్యవిద్వాంసుల ధోరణి. ఇక పాశ్చాత్యులు—ఒకరు క్రీస్తు పూర్వము ఐదు వందల సంవత్సరము ప్రాంత మనగా వేరొకరు బుద్ధుడు పుట్టిన తరువాత యనును. మరొకరు క్రీస్తుపూర్వము పదియవ శతాబ్ద ప్రాంతమందురు.—ఈ విధముగా మహాభారతయుద్ధకాలము కౌరవుల కొలువుకూటము వలెనే నానాప్రకారములుగా నున్నది.

ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. ముసలివాడు కూడ. ఆయన యుద్ధ భూమికి వచ్చువాడు కాడు. నీకు యుద్ధము చూడవలయు నని యున్నచో దివ్య దృష్టిని ప్రసాదింతు నని వ్యాసుడు ధృతరాష్ట్రునితో అనినాడు. నే నా క్రూర ముగా పోరుటను కనుగొనలేను. వినగా వలతును. మీరు నా కది అనుగ్రహించిన చాలును. ఇట్లు ధృతరాష్ట్రు డనినమీదట వ్యాసు డొక ఏర్పాటు చేసినాడు.

ధృతరాష్ట్రు డింటివద్దనే యుండును. సంజయుడు యుద్ధభూమికి పోవును. ఆయన తిరిగివచ్చి అక్కడ జరిగినదంతయును ఈయనకు చెప్పును. అట్లు చెప్పుటకు కావలసిన శక్తిసామర్థ్యములను వ్యాసుడు సంజయున కనుగ్రహించెను. సంజయుడు యుద్ధము చూడబోయినవాడు ప్రతిదినము ధృతరాష్ట్రుని యొద్దకు రాడు. అప్పుడప్పుడు వచ్చి విశేషములు చెప్పిపోవును. మొదటిసారి పోయిన వాడు పది దినముల తరువాత వచ్చెను. తిరిగిపోయి అయిదు రోజుల పిమ్మట వచ్చెను. మరల పోయి రెన్నాళ్లకు వచ్చెను. ఈసారి పోయినవాడు మర్నాడే వచ్చెను. ఈ విధముగా పదునెనిమిది దినముల యుద్ధమును నాల్గుసార్లుగా సంజ యుడు ధృతరాష్ట్రునకు వినిపించెను. సంజయు డెప్పుడు వచ్చినను రాత్రిపూట వచ్చును. తెల్లవార్లును యుద్ధమును చెప్పి తిరిగి తెల్లవారువరకు కురుక్షేత్రము చేరుకొనును. చిట్టచివరిసారి వచ్చినప్పుడుమాత్ర ముదయముపూట వచ్చెను. కౌరవపక్షమున సేనానాయకునకు మారకము వచ్చినదాక సంజయుడు ధృత రాష్ట్రునివద్దకు రాడు. వచ్చినవాడు రాగానే తమ పక్షమున నాయకుడు పడి పోవుటను పేర్కొనును. ధృతరాష్ట్రుడు నెత్తినోరు కొట్టుకొని ఏడ్చును. ఆ పిమ్మట ఆ చనిపోయిన సర్వసైన్యాధిపతి జరిపించిన యుద్ధమునాళ్ల విశేష

ముల కథనము సాగును. అది ఎన్నాళ్ల యుద్ధమైనను కనీసము ఒక రాత్రిలో పూర్తి కావలయును. తిరిగి తెల్లవారువరకు సంజయుడు ఆ తరువాతి యుద్ధమును చూచుటకు పోవలయును కదా! అందుకని. శల్యు డొక పగలు కౌరవ సేనలను నడిపించి ధర్మరాజు చేతిలో చచ్చినాడు. ఆ రాత్రికి సంజయుడు హస్తినా పురమునకు రావలసినదే. రాలేదు. అశ్వత్థామ కౌరవ సైన్యాధిపతియై ఆరాత్రి యుద్ధము సాగించినాడు. అందువలన దానిని గూడ చూచి దుర్యోధనుడు మర ణించుటను గూడ చూచి-యుద్ధము ముగిసినందున ఆ ఉదయమున సంజయుడు ధృతరాష్ట్రుని చూడవచ్చెను.

మన భారతయుద్ధ కథన విధానమును వ్యాసు డీవిధముగా అల్లికచేసి నాడు.

ఈ మహాభారతయుద్ధ మగుటకు దుర్యోధనుడే కారణము. యుద్ధము కాక తప్పని పరిస్థితులు కల్పించినట్లే కురుక్షేత్రమున పాండవులమీదకు సైన్యములను నడిపించి యుద్ధము ప్రారంభము కాక తప్పని పరిస్థితిని కల్పించి నది కూడ దుర్యోధనుడే. ఆగ్రహోదగ్రుడై ఆజ్ఞాపించినది దుర్యోధనుడు. సైన్యమును పురికొల్పినది దుశ్శాసనుడు. సైన్యమును ముందుకు నడిపించినది భీష్ముడు. పాండవుల పక్షమున కౌరవులను మొదట ఎదుర్కొన్నది భీముడు. కౌరవ పాండవ సైన్యములు ఒండొంటిని తలపడుటను గూర్చి తిక్కన్న గా రిట్లు వ్రాసిరి:

"పదపడి దుర్యోధను డు
న్మదుడై తఱుమంగ ధర్మనందనుడు జయా
స్పదముగ పురికొల్పగ బె
ట్టిదముగ నొండొంటి దలపడియె సైన్యంబుల్". (1-241)

అటు ప్రతినాయకుడు దుర్యోధనుడు, ఇటు నాయకుడు ధర్మరాజు తమతమ సైన్యములను ముందుకు దూకించుటలోనే నాయకుడు జయాస్పదముగ పురికొల్పి విజయలక్ష్మిని వరింపబోవుటను సూచించిరి. దుర్మోధను డున్మదుడు గనుక వాని కెప్పుడైనను పతనము కావలసినదే. భారతయుద్ధముయొక్క పర్యవసానమును ఈ విధముగా యుద్ధము మొదలనే నిరూపించి రచించుట మిక్కిలి బుద్ధికుశలుడైన కవి చేయగలడు.

## భీష్మ పర్వము

భీష్మపర్వము యుద్ధపర్వము లైదింటిలో మొదటిది. కౌరవులపక్షమున సర్వసేనాధిపతి భీష్ముడు. పదునెనిమిది దినముల మహాయుద్ధములో పది దినములు ఈ కురువృద్ధుడే నిర్వహించెను. యుద్ధపర్వముల పేర్లన్నియు కౌరవపక్షము సేనానాయకుల పేర్లమీద పెట్టబడినవి. పాండవపక్షమున మొత్తము పదునెనిమిది దినముల యుద్ధమును ఒక్క ధృష్టద్యుమ్నుడే నాయకుడై నడిపించెను. కౌరవపక్షమున నలుగురు సేనాపతులు నేల కొరిగిరి. వారువారు సేనాపతులుగా నున్నంతవరకు జరిగిన యుద్ధము వారు జరిపించి నట్లేకదా: అందువల్లనే ఆయా పర్వములకు వారి పేర్లు. సౌప్తిక పర్వమున నాయకుడు అశ్వత్థామ. ఆ పర్వమునకు వానిపేరు లేదు.

భీష్మపర్వమున 117 అధ్యాయములు. 5884 శ్లోకములు. అధ్యాయముల సంఖ్య కింకొకటి కలుపుటకు వీలున్నది. శ్లోకములకు లేదు. శ్లోకముల విషయమున ఇట్లేకవాక్యత కొదుగు ఆరు పర్వములలో భీష్మపర్వము మొదటిది. మిగిలినవి శల్య - సౌప్తిక - శాంతి - మౌసల - స్వర్గారోహణ పర్వములు.[8] నన్నయ్యగారును ఈ పర్వముల శ్లోకసంఖ్య నిట్లే చెప్పెను.[9] అధ్యాయముల సంఖ్య ఆయన ఏ పర్వమునకును చెప్పడు గనుక దీనికిని చెప్పలేదు.

నన్నయగారు పర్వానుక్రమణికలో ఇట్లు చెప్పిరి: జంబూషండ వినిర్మాణంబు, భూమి పర్వంబు, భీష్మాభిషేకంబు, భగవద్గీత, భీష్మవధ - ఇది భీష్మ పర్వము. పర్వ సంగ్రహమునందు కూడ ఇదే విషయ మించుకంత వివరించి చెప్పబడినది. నన్నయగారి పర్వసంగ్రహము ననుసరించియే తిక్కన్నగారు పదునైదు పర్వములను రచించిరి.

జంబూషండవినిర్మాణము, భూమిపర్వము రెండును మూలభారతమునకు తరువాత చేర్పబడియుండు నని చాలమంది అనుకొనుచున్నారు. జంబూషండ వినిర్మాణము పద్మ పురాణములోనిదట.[10]

---

8. A. B. R. Vol. XXIII, Parts I—IV. Pages 551, 553, 558.
9. ఆం. ఆ. 1–45.
10. *V. Venkatachellam Iyer*, The Mahabharata, Page 250.

"భూమికి గాగ ప్రాణముల పోక దలంపక రౌద్రఘోర సం
గ్రామము సేయుచుండుదురు రాజులు తొల్లియు నెంత తీపొకో
భూమి......... నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము—" (1-15)

అని ధృతరాష్ట్రు డడిగినమీదట సంజయుడు జంబూషండవినిర్మాణ భూమిపర్వములను వినిపించినాడు. వినిపించి,

"వెరవు లావు గలుగు నరనాథు లింత దే
శంబు గలదు తమకు చాలు ననరు
తండ్రి బిడ్డ యన్న తమ్ముడు నా కెత్తి
పోయి పోటులాడి పుడమి గొంద్రు." (1-42)

"కావున కౌరవ పాండవు లీ
వసుధకునై పెనంగు" (1-43)
టెగ్గు కాదని యుద్ధమును సమర్థించుచు మాట్లాడినాడు.

చారిత్రక విషయములను గాని, భౌగోళిక విషయములను గాని ప్రత్యేకముగా వివరించి చెప్పు గ్రంథములు మనకు లేవు. మన పురాణేతిహాసముల యం దాయా విషయము లప్పుడప్పుడు చోటు చేసికొనుచుండును. మరియు నక్కడొకటి అక్కడొకటిగా చెప్పబడియుండును. వాటినే జాగ్రత్తగా ఒక చోటికి చేర్చుకొని చూచుకొన్నచో మన పూర్వచరిత్ర తెలియును. మన భౌగోళిక విషయములు తెలియును.

భీష్మపర్వము ప్రధానముగా నాలుగు ఉపపర్వములతో నున్నది. 1) జంబూఖండ నిర్మాణ పర్వము. 2) భూమి పర్వము. 4) భగవద్గీతా పర్వము. 4) భారత యుద్ధము. ఇందులో ఏ విధమైన ఉపాఖ్యానములును గాని లేవు. మొదటి రెంటిని కలిపి భూమిపర్వ మనియు, చివరిదానిని భీష్మవధపర్వ మనియు మనము వ్యవహరించుకొన్నచో విషయవివేచనమున కింకను వెసులుబా టెక్కువ దొరుకును.

జంబూద్వీపము ప్రపంచమును చేయుచున్న ఏడు ద్వీపములలో నొకటి.

మిగిలినవి - శక ద్వీపము, కుశ ద్వీపము, శ్యామల ద్వీపము, క్రౌంచ ద్వీపము, గోమేధ ద్వీపము మరియు పుష్కర ద్వీపము. జంబూద్వీపము భారత వర్షమే. జంబూద్వీపమును గూర్చి బౌద్ధమత గ్రంథములుగూడ చెప్పు చున్నవి. జంబూద్వీపము భారతదేశమే అనుట కుపపత్తు లంత అనుకూల ముగా లేవని చారిత్రకపరిశోధకు లందురు.[11]

జంబూ ద్వీపమునందు ఏడు వర్షము లున్నవి. 1) ఇలావర్త వర్షము 2) రమణక వర్షము 3) శ్వేత వర్షము 4) ఉత్తర కురు వర్షము 5) భారత వర్షము 6) కింపురుష వర్షము 7) హరి వర్షము. ఈ ఏడింటికిని తరువాత భద్రాశ్వ వర్షము, గంధమాదన వర్షము అని మరి రెండు కలుపబడినవి. మత్స్య, బ్రహ్మాండ పురాణములయందు ఈ పైన చెప్పబడిన పేర్లు భిన్ననామములతో నున్నవి. మహాభారతమునందున్న పేర్లు కూడ అన్నియు ఈ పురాణములయం దున్నట్లు లేవు.

భారతవర్షము మిక్కిలి దక్షిణమున కున్నది. ఉత్తరమున హిమాలయ పర్వతములనుండి దక్షిణమున సముద్రము వరకు ఇది వ్యాపించియున్నది.[12] మరియు పురాణములం దీభారతవర్షము నవఖండమండితముగా పేర్కొన బడినది. ఆయా విషయముల నన్నింటిని సమన్వయముమీద చూచినచో ప్రస్తుత మున్న మన భారతదేశమునకంటె అప్పటి భారతవర్షము మిక్కిలి విస్తృత మైనదిగా కనిపించుచున్నది. మరియు భారతవర్షములోని నవఖండము లలో ఒక్క కుమారీఖండము ఇప్పటి భారతదేశముగా నున్నది. మిగిలిన ఖండములను గుర్తించుటలో పరిశోధకులకు ఏకాభిప్రాయము కుదురలేదు.[13] భారతదేశమునకు కూర్మచక్ర మనికూడ పేరున్నది. పరాశర వరాహమిహి రాదు లట్లు పేర్కొనిరి. ఈదేశము కూర్మాకృతిగా నున్నట్లు వారు భావించిరి.

భారతీయు లీనాడును జంబూద్వీపమును, భరతవర్షమును, భరత ఖండమును మరియు నీభారతఖండము మేరువునకు దక్షిణ దిగ్భాగమున యందుండుటను సంధ్యావందనములందు స్మరించుచున్నారు.

11. A. B. R. XV, Parts I—II. Page 4.
12. విష్ణుపురాణము 2–3–1, నారదపురాణము 3–46.
13. A. B. R. XVII, Part III. Page 219.

వసుంధర సప్తద్వీపములుగా నున్న దనుమాటయు కలదు. జంబూ ద్వీపము పేరే కాశ్మీరములోని జమ్మూ రాష్ట్రమునం దింకను నిలచియున్నది [14] భారతవర్షము హిమాలయములనుండి దక్షిణమున సముద్రముదాక వ్యాపించి యుండుటను బట్టి జంబూద్వీప మింకను ఉత్తరము ముట్టియున్నది కావలయును.[15]

## శ్రీమద్భగవద్గీత

దీనిని అనంతగీత అనుటయు కలదు.[16] దీనిని కలుపుకొనియే బ్రహ్మ సూత్రములు- ఉపనిషత్తులు ప్రస్థానత్రయముగా ప్రసిద్ధి పొందినవి. బాదరా యణుని సూత్రములకే బ్రహ్మసూత్రము లని ప్రసిద్ధి. బాదరి- ఔడులోమి- మొదలైన వారి సూత్ర గ్రంథములకును బ్రహ్మసూత్రము లనియే పేరు. కాని అది బాదరాయణుని వేదాంత సూత్రగ్రంథమునందే రూఢము.[17]

ఇప్పుడు మన కున్న భగవద్గీత యందు మొత్తము ఏడు వందల శ్లోకము లున్నవి. ఏడు వందల నలుబదియైదు శ్లోకములతో నొక భగవద్గీత యున్నది. శ్రీ భువనేశ్వరీ పీఠాధిపతులు (సౌరాష్ట్ర, గోండాల్) ఆచార్య శ్రీ చరణ తీర్థ మహారాజుగా రాగీతను సంపాదించి అసలు భగవద్గీత 745 శ్లోకములతో నున్నదే కాని 700 శ్లోకములతో నున్నది కాదని నిరూపించు పీఠికతో ప్రక టించిరి. దానివల్ల భగవద్గీతా విజ్ఞానములో హెచ్చుతగ్గు లేర్పడలేదు. మత త్రయమువారి భాష్యము 700 శ్లోకములకే యున్నది.

ప్రస్థానత్రయములో భగవద్గీత ఉపనిషత్తులతో సమానముగా నున్నది. బ్రహ్మసూత్రార్థనిరూపణమునకు ఉపనిషత్తులు ప్రమాణములు. ఇవన్నియును దుఃఖనివృత్తిని సాధించుటకు ప్రవర్తించినవి. దుఃఖనివృత్తి జ్ఞానమువల్ల కలుగును. జ్ఞానము చిత్తశుద్ధిద్వారా కలుగును. చిత్తశుద్ధి కర్మయోగము వల్ల కలుగును. దుఃఖనివృత్తియే మోక్షము.

---

14. A. B. R. XVIII, Part III. Page 231.
15. A. B. R. XIII, Part III. Page 231.
16. A. B. R. Vol. XLVII, Parts I—IV. Page 15.
17. Ibid. Page 16.

భగవద్గీత ఎప్పుడు ప్రవర్తించినది? కౌరవులు పాండవులు కురుక్షేత్ర మున యుద్ధమునకు తలపడిరి. ఇరుపక్షములును పరస్పరము ఎదురెదురై మీదబడుటకు సిద్ధముగా నిలబడిరి. అర్జునుడు ఇరుపక్షములను తేరిపార జూచి నాడు. ఇరుపక్షముల వారును బంధువులుగానే కనిపించినారు. హఠాత్తుగా కృపావిష్టుడై మోహమును పొందినాడు. యుద్ధము చేయ ననినాడు. యుద్ధము లో స్వజనమును చంపిన తరువాత వచ్చెడి శ్రేయ మేదియును లేదన్న విశ్వాస మేర్పడిన దర్జునునకు. బంధుజనమును చంపినమాత్రమున సుఖ మెట్లు కలుగునో అర్జునున కర్థము కాలేదు, యుద్ధమున కనభిముఖుడై శోకసంవిగ్న మానసు డైనాడు. భగవంతుడు గీతను ప్రవర్తింప జేసినాడు. తత్ఫలితముగా అర్జు నుడు యుద్ధముచేసి జయించినాడు. మహాభారతములో భగవద్గీతకు సద్యఃప్ర యోజనము యుద్ధము చేయుటకు నిరాకరించిన అర్జునుడు యుద్ధమునందు సమ ధికోత్సాహముతో ప్రవర్తించుట.

మహాభారత సందర్భమును బట్టి ఇంత మహాదీర్ఘముగా భగవంతు డుప దేశించియుండుటలో ఔచిత్యము కానవచ్చుట లేదను అభిప్రాయ మొకటి దేశమున వ్యాపించి యున్నది. ఇక దానిమీద చిలవలు పలవలుగా ఎన్నెని ఊహలు చేయబడినవి. బౌద్ధమతము దేశమున వ్యాపించిన తరువాత తాత్త్విక మార్గ మొకవిధముగా లేని విపరీత పరిస్థితి ఏర్పడినది. దానినుండి భారతీయ తాత్త్విక తను సముద్ధరించుటకు జరిగిన ప్రయత్నములలో భగవద్గీతారచన ఒకటి. అందువల్లనే అది అంత పెద్దగ్రంథముగా తయారైనది. అవి ఈమాదిరిగా నుండును.

ఈ భగవద్గీతను తిక్కన్నగారు పూర్తిగా అనువదించలేదు. ఆంధ్ర మహాభారతమున భగవద్గీతాఘట్ట మున్నది. దానిని తిక్కన్నగారు నిర్వహించిన విధము మహాకుశలముగా నున్నది.

ఉభయకటకములవారును రణరంగమున సమావేశమైరి. అర్జునుడు కౌరవపాండవసైన్యసమూహములు రెండింటిని తేరిపారజూచినాడు. అప్పుడు వానికి పరమకృపావేశ మెత్తినది. విషాదము కలిగినది. తాను తనరక్త బంధువులతో యుద్ధమునకు దిగిన ట్లనిపించినది. అట్లు యుద్ధమును చేయుట తనకు తగదని తోచినది. దుఃఖము ముంచుకొనివచ్చినది. నే నీయుద్ధము

చేయలే నని గాండీవమును జారవిడిచి యతడు రథముమీద కూలబడినాడు. అప్పుడు శ్రీకృష్ణు డన్నాడు:

'దెప్పరపుఁజోట నీ కీ
యొప్పనివిధ మెచటనుండి యొదవెను విను మీ
చొ ప్పవివేకులయది యిది
దప్పించును సద్గతియు నుదాత్తయశంబున్.' (1-191)

అర్జునున కప్పుడు కలిగిన విషాదవిహ్వలత కలుగరానిది. ఆస్థలము దెప్పర మైనది. అచట అట్టియూహలు రాకూడదు, దెప్పర మనగా ఆపత్కరము మరియు విషమము అని. కౌరవ పాండవుల మధ్య గల లావాదేవీలు యుద్ధ భూమికి సన్నద్ధమై వచ్చి పరిష్కరించుకొనవలసినంతగా విషమించినవి, అంతగా ఆపద ముంచుకొని వచ్చినది. ఆస్థల మట్టిది. ఆసమయ మట్టిది. ఆ స్థలమునకు, ఆ సమయమునకు తగిన విధముగా అర్జునుడు ప్రవర్తించుట లేదు. అందుకనియే శ్రీకృష్ణు డనినాడు ఈ చొప్పు అవివేకులయది అని. భగవద్గీత కిది పునాది తీయుట. అవివేక మనగా వివేకము కానిది వివేకమనగా నేమి ? వివేక మనగా జ్ఞానము. ప్రకృతి నుండి పురుషుని వేరుగా ఎరుగుటయే జ్ఞానము. ప్రకృతియైన మాయకు అతీతుడుగా పరబ్రహ్మమైన ఆత్మని తెలిసి కొనుట ఏది కలదో అది వివేకము. ఈవివేకము నశించుటచేతనే అర్జునునకు విషాదము పట్టుకొన్నది. దానిచే అతడట్లు పట్టుబడుట అవివేకము. అర్జును డవివే కి యని శ్రీకృష్ణుడు స్థాపించుచున్నాడు. అవివేక మిట్టిట్టి దని తెలసిన తరువాత వివేకము ద్వారా దానిని తొలగించుకొనవచ్చును. నీ వవివేకుడ వని శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పినాడు. వీరు బంధువులు వీరు నావారు, వీరిని నేను చంపబోవు చున్నాను. వీరిని నేను చంపను. ఈమొదలైన ఆలోచన అంతయు అవివేకము. అప్పటి అర్జునుని ఆలోచన అంతయు నదియె. బంధువులు లేరు. శత్రువులును లేరు. నావారు లేరు నావారు కానివారును లేరు. ఒకరినొకరు చంపువారు లేరు. ఎవరినివారు చంపుకొనరు. ఎవరును చంపరు. ఎవరును చావరు ఆత్మ నిత్యము. ఆత్మకానిది లేదు, అందుకనే అది అద్వైతము. ఉపాధి ఎప్పుడును శాశ్వతము కాదు. ఆత్మ ఎప్పుడును నశ్వరము కాదు. ఈవిషయమున నెరుకయే వివేకము. అదే జ్ఞానము. శ్రీకృష్ణుడు భగవద్గీతాముఖమున బోధింపదలచిన వివేకమంతయు

నిదియే. అందుకు ప్రాతిపదికగా అర్జునుని విషాదమును గూర్చి ఈచొప్పు అవివేకులయది అని శ్రీకృష్ణు డనినాడు. అవివేకిని వివేకినిగానేగదా సద్గురువు మార్చును. శ్రీకృష్ణుడు సద్గురువు. భగవద్గీత అంతయు వట్టి వివేకము. మరియు భగవంతు డనినాడు. ఇది తప్పించును సద్గతియును ఉదాత్తయశమును అని. సత్ అనగా అద్వితీయ పరబ్రహ్మము. ఆ బ్రహ్మమును గూర్చి పోవుటయేగతి. సద్గతి యనగా మోక్షము. బ్రహ్మమును పొందుట-బ్రహ్మమగుటయే మోక్షము. అవివేకము మోక్షమును తప్పించును. ఇది పారమార్థికవిషయము. మరి ఐహికము మాటయో? ఎవనిని అవివేకము ఆవరించునో వాని కిహమున యశోహానిని కలిగించును. మన అసమర్థతను మనశత్రువులు భావించుటయే మన కయశము. ఈజీవితమున నంతకంటె మిక్కిలికష్టము లేదు. అవివేకికి ఇహము లేదు పరము లేదు. వివేకికి ఇహము కలదు పరము కలదు. కృష్ణుడు గీతోపదేశము చేసినాడు. అర్జునుడు వివేకి యైనాడు. యుద్ధముచేసి విజయియై ఇహమున ఉదాత్తయశమును, కాలాంతరమున పరమున మోక్షమును పొందినాడు. భగవద్గీత ఇహపర సాధనమైనది. ఈదృశమైన భగవద్గీతను తిక్కన్నగా రనువదింపలేదు.

తిక్కన్నగారు భగవద్గీతను అనువదింపలే దని చెప్పుటకు ముందు మరియు ఆలోచించవలెను.

అర్జునుని యుద్ధవిముఖతను నివారించుట సందర్భముగా భారతమున గీత ప్రసక్తించినది. అనగా రణోత్సాహకారణముగా స్వధర్మావలంబనము వదలదగమిని అర్జునుడు తెలిసికొనుట కేయేవిషయములు శ్రీకృష్ణుడు చెప్పినాడో అదంతయును భగవద్గీత. పదునెనిమిది అధ్యాయములలోని ఏడు వందల శ్లోకముల తాత్పర్యమును అదియే కావలయును. కేవలము శ్రీకృష్ణపరమాత్మ చేసిన ఉపదేశము ఐదువందల డెబ్బదినాల్గు శ్లోకములమేర వ్యాపించియున్నది. కాని యథార్థమునకు గీత ఒక్కకర్మ ప్రాధాన్యము నే చెప్పుటలేదు "లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా, జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్'' (3-3) కర్మజ్ఞానములు రెండింటిని గీత చెప్పినది. భాష్యకారులు నిష్కామ మైన కర్మను జ్ఞానసాధనముగా చెప్పినారు. మరి అర్జునుని విషయముననను ఈయర్థమునే భావించినచో వానియుద్ధమున ప్రవర్తించుట జ్ఞానమునకు సాధనము కావలయును. కాని కాలేదు. మహాభారతమున గీతకు అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటయే ఫలము. అశ్వమేథపర్వమున అర్జునుడు

శ్రీకృష్ణునితో ఇట్లనినాడు :

"అనికి దొడంగునప్పుడు మదాత్మ కలంగిన కొన్ని తత్త్వబో
ధన మహానీయవాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి తే
మనమున వానియర్థములు మాధవ నిల్పగజాల నైతి." (1.153)

శ్రీకృష్ణుని ఉపదేశము పూర్తిగా అర్జునున కప్పుడు పట్టలేదు. స్వధర్మమునందు ప్రవర్తించుట ఒక్కటే అర్జునున కానాడు పట్టినది. తదనుగుణముగా ప్రవర్తించినాడు. అట్టిచో భగవద్గీతను మొత్తముయథాతథముగా భీష్మపర్వమున తిక్కన్నగారు వ్రాసియున్నచో అర్జునునియందు ఫలము నకు రాని అనగా వానిబుద్ధి కెక్కని విషయముకూడ వ్రాయబడినట్లగునుకదా! ప్రయోజనరహిత మైన విషయము నంతగా నేల వ్రాయవలయును? అందువలన తిక్కన్నగారు భీష్మపర్వమున భగవద్గీతను మొత్తమునకు మొత్తముగా అను వదించలేదు.

అయినచో భగవద్గీతాగత బహువిషయములు తెనుగు భారతమున లేకుండ పోయినట్లే కదా అనవచ్చును. ఎక్కడకును పోలేదు. శాంత్యనుశాసనాశ్వమేధ పర్వములయందు గీతార్థము రకరకములుగా వ్యాపించియున్నది. మొదలు స్త్రీపర్వమున ధృతరాష్ట్రుని ఉపశమింపజేయుటకు విదురుడు చెప్పిన మాట లయందే గీతార్థము గుబాళించుచున్నది. ఎట్లును తరువాతిపర్వములలో ప్రయో జనసహితముగా జ్ఞానబోధ జరుగబోవునప్పుడు ప్రయోజనరహితముగా పదు నెనిమిది అధ్యాయముల గీతను ఏడువందలశ్లోకములతోడిదానిని తుచ తప్పక వ్రాయవలసిన పనిలేదు. అందుకే తిక్కన్నగారు వ్రాయలేదు.

భగవద్గీత ముఖ్యముగా సాంఖ్యయోగములనుగూర్చి చెప్పినది. శాంతిత్రయమున గల వేదాంత విషయమంతయు నదియే. భారతమున శాంతిత్ర యాదికమునం దున్న సాంఖ్యయోగవిషయములను పరిశీలించినచో అవి గీత యందలివే అని తెలియగలదు. గీతకు అతిరిక్తములు కావు. అందువల్ల తిక్కన్న గారి భారతమున గీతార్థము లేకుండ పోయిన దన్నచింత అక్కరలేదు. అర్జు నుడు యుద్ధమున ప్రవర్తించుటకు భగవద్గీతలోని ఏభాగము మిక్కిలిగా తోడ్పడిన దని తిక్కన్నగారి కనిపించినదో ఆభాగమునే ఆయన వ్రాసెను.

లౌకికముగా చూచినచో శ్రీకృష్ణుడు చెప్పిన మాట అర్జునుడు వినుటయే జరిగినది. ఆయన యుద్ధము చేయుమనగా ఈయన చేసెను. నిత్యజీవితములో మనము చూచుచునేయున్నాము. ఒకడు చెప్పును. ఇంకొకడు చేయును. చేయువానికి చెప్పినవానియందు భయభక్తులుగాని గౌరవమర్యాదలుగాని ఉండవలయును. ఒకనిమాట నొకడు చేయుటకు భయభక్తులే ముఖ్యకారణము. గీతోపదేశసందర్భమున శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించి అర్జునునియం దాభావములను కల్పించినాడు. ఏకాదశాధ్యాయమునం దున్న అర్జునునిమాట లను నిదానముగా విచారించినచో ఆవిషయము స్పష్టము కాగలదు. విశ్వరూప మును చూచిచూచి అర్జునుడు చివర కనినాడుగదా "నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్" (11-31) ఈఘోరరూపముతో నీవు ప్రవర్తించుటలోని నీయాంత ర్యము నాకు బోధపడుట లేదు-అని. అప్పుడు నేను లోకనాశనముకొరకు వృద్ధి నొందిన యముడ నని చెప్పచు శ్రీకృష్ణుడు "ఉత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్." (33) లెమ్ము శత్రువులను జయించి యశమును పొందుము అని అర్జునుని హెచ్చరించినాడు. శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించినది అర్జునుడు శత్రువులను జయించుటకొరకు. అదియే శ్రీకృష్ణుని ఆంతర్యము. అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటకు పదునొకండవ అధ్యాయము ప్రబల మైన హేతువు.

'ధర్మక్షేత్రే కురుక్షేత్రే, - యత్ర యోగీశ్వరః కృష్ణో.' అను ఈ మొద లైన భగవద్గీతయొక్క ఆద్యంత శ్లోకములను యథాతథముగా తిక్కన్నగారు భీష్మపర్వమున గీతోపదేశమున కాద్యంతములుగా నిక్షేపించిరి. ఇందువల్ల ఆద్యంతములుగా వ్యాపించిన భగవద్గీతయొక్క తాత్పర్యము ఇందు మాచేతను నిక్షిప్త మగుచున్న దన్న సూచనను మనము భావించవచ్చును. మరియు జాగ్ర త్తగా పరిశీలించినచో తిక్కన్నగారు వ్రాసిన గీతోపదేశమున ఎక్కువగా ఏకాదశాధ్యాయమునందలి శ్లోకముల యర్థమునే మనము చూడగలము. అర్జు నుడు యుద్ధమున ప్రవర్తించుటకు శ్రీకృష్ణునిమాట వినుట కే అధ్యాయము ముఖ్యమో ఆఅధ్యాయమునందలి శ్లోకార్థముల నెక్కువగా గ్రహించి వ్రాసెను. మొత్తము గీతనుండి రెండు మూ డటునిటుగా నూరు శ్లోకముల యర్థమును తిక్కన్నగారు తెనుగున వ్రాసిరి. అందు నలుబది శ్లోకములయర్థ మొక్క ఏకాదశాధ్యాయమునుండి గ్రహింపబడినది. ఈభగవద్గీతానువాద విషయము

నెంత సూక్ష్మముగా విచారించి తిక్కన్నగారు సర్వతంత్రస్వతంత్రముగా ప్రవర్తించినదియు ఇక బుద్ధిమంతు లూహింపవచ్చును. కనుక గీతను మొత్తము భీష్మపర్వమున తిక్కన్నగా రనువదింపలేదు. అనువదింపక పోవుటయే ఔచిత్యవంతముగా నున్నది. మరియు నక్కడక్కడ గీతాశ్లోకముల కివి అనువాదపద్యములా అన్న ట్లున్నవి కొన్ని తిక్కన్నగారి భారతమున కనిపించునవి కలవు.

1) "శ్రేయాన్స్వధర్మో విగుణః"- (3-35) ఇత్యాది శ్లోకమునకు "ఒప్పకున్నను నాత్మకులోక్తకర్మ మూర్ధ్వగతి జేర్చు-" (శాంతి 1 279) అని తిక్కన్నగారి పద్యము.

2) "యదృచ్ఛాలాభ సంతుష్టో- (4-22)" ఇత్యాది శ్లోకమునకు శాంతి పర్వమున

"అనఘ సుఖదుఃఖములు వచ్చినపుడు మదవి
షాదములు లేక సంప్రాప్తనముపభోగ
రతుఁడు నప్రాప్యవాంఛానిరాసకుండు
నగుట సారతపోరూప మండ్రు బుధులు "(5-501) అని తెనుగుపద్యము.

3) 'విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని"- (5-18) ఇత్యాది శ్లోకమునకు తిక్కన్నగారి తెనుగుపద్యము

"వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నా
వ్వునెఱయు హస్తియందు నొకపోకకుఁ బోవని కుక్కయందు దా
ని నడచి తెచ్చి వండి తిను నీచపుమాలనియందు తుల్యద
ర్శనులు తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్". (5-109)

4) "సర్వతః పాణి పాదం"- (13-14) ఇత్యాది శ్లోకమునకు తిక్కన్న గారి పద్యమును అశ్వమేధ పర్వమున (1-223) 'కలయంగ నెల్లయెడలం దలలును' అను ఈ మొదలైన పద్యమును చూచునది.

ఈవిధముగా మరికొన్ని శ్లోకములు పద్యములు ఏరి చూపించవచ్చును. ఇంతకును ఫలితార్థ మేమనగా భీష్మపర్వమున తిక్కన్నగారు భగవద్గీతను మొత్తముగా వ్రాయకపోవుటయే సముచితముగా నున్న దనియు, గీతార్థము తెలుగుభారతమున నష్టమై పోలేదనియు, అది తరువాతి శాంత్యాది పర్వములలో నిక్షిప్తమై యున్న దనియును.

భగవద్గీత ఏఅధ్యాయమునుండి ఏఏశ్లోకములను గ్రహించి తిక్కన్నగారు వ్రాసినదియు ఇక్కడ చూపబడుచున్నది.

| శ్రీమద్భగవద్గీత | | ఆంధ్ర మహాభారతము | శ్రీమద్భగవద్గీత | | ఆంధ్ర మహాభారతము |
|---|---|---|---|---|---|
| అధ్యా. | శ్లోకములు | భీష్మ ప్ర. ఆ. పద్యములు | అధ్యా. | శ్లోకములు | భీష్మ ప్ర. ఆ. పద్యములు |
| 1. | 1 | 171 | 11. | 5 | 208 |
| | 3 | 173 | | 8 | 209 |
| | 4-13 | 174 | | 9, 12, 14 | 210 |
| | 15-18 | 173 | | 15-25 | 211-213 |
| | 19 | 177 | | 26, 27, 31 | 214 |
| | 20 | 178 | | 33-35 | 215 |
| | 21-23 | 179 | | 38, 39 | 216 |
| | 24-27 | 180 | | 41, 42 | 217 |
| | 29-32 | 181 | | 44 | 218 |
| | 33 | 182 | | 46 | 219 |
| | 34-42 | 183-187 | | 48, 53, 54 | 220 |
| | 45-46 | 183 | | 55 | 221 |
| 2. | 1 | 189 | 18. | 66 | 224 |
| | 2 | 190 | | 67 | 226 |
| | 4, 5 | 193 | | 72 | 227 |
| | 7 | 194 | | 73 | 228 |
| | 11 | 195 | | 74, 77 | 229 |
| | 13,17,20-23 | 196 | | 78 | 231 |
| | 31, 32 | 201 | | | |

## వ్యూహ రచన

భీష్మ సేనాపతి భారతయుద్ధము మొదటినాడు తీర్చిన వ్యూహము మానుష వ్యూహము. కౌరవులు మానుషమును నమ్ముకొనియే యుద్ధమునకు

దిగినారు. వారికి దైవమునందు విశ్వాసము లేదు. దైవముముందు మాను షము పనికిరాదు. పాండవుల పక్షము దైవ పక్షము. వా రానాడు అచల వ్యూహము పన్నిరి. అచల పదార్థము పరమేశ్వరుడు. ఆయన అంతటను వ్యాపించి యున్నాడు. ఆయన చలించుట కవకాశము లేనివాడు. అందు వలన అచలుడు. పాండవులు యుద్ధప్రారంభదివసమున పన్నిన వ్యూహము భగవద్వ్యూహము. భగవంతుడు వ్యూహాత్మకుడు. యుద్ధభూమి యం దది అచల వ్యూహము. భీష్మ సేనాపతి కౌరవుల యోగ్యతకు తగిన వ్యూహము పన్ని యుద్ధము ప్రారంభించినాడు.

దైవముముందు మానుషము జయించదు. ఆ యిరుపక్షములందలి వ్యూహములును ఆ విషయమునే సూచించుచున్నవి. భీష్ముడు మహాభక్తుడు. ఆయనకు భగవత్స్వరూపము తెలియును. భగవంతునిముందు మనుష లెంత యన్నది నిరూపించుటకే భీష్ముడు పాండవుల కెదురై నిలిచినాడు. తన సైన్య మును మానుష వ్యూహమున నిలిపి దాని ఫలితమును వారికి కుడిపించినాడు.

మొత్తము పదునెనిమిది దినములు జరిగిన భారత యుద్ధమున ఒకటి-మూడు-ఐదారేడెనిమిది - పదునొకండు - పన్నెండు - పదునారు దినములందు మాత్రమే కౌరవ పాండవులు వ్యూహములు పన్ని యుద్ధములు చేసినది: నాలుగు-పది - పదునైదు దినములం దసలు వ్యూహములే లేవు. తొమ్మిది - పదమూడు - పదనాల్గు - పదునెనిమిది దినములం దొక్క కౌరవులే వ్యూహములు కట్టి మోహరించిరి. రెండవనాడు పదునేడవనాడు కేవలము పాండవులు మాత్రమే వ్యూహములు తీర్చి యుద్ధము చేసిరి. ఈయన్ని దినములందును పన్నబడిన వ్యూహములు 1) మానుష 2) అచల 3) క్రౌంచ 4) గరుడ 5) అర్ధేందు 6) మకర 7) శ్యేన 8) మండల 9) వజ్ర 10) కూర్మ 11) శృంగాటక 12) సర్వతోభద్ర 13) శకట 14) మండలార్ధ 15) చక్ర 16) సూచి 16) దుర్జయ నామక వ్యూహములు. క్రౌంచ వ్యూహమును రెండవనాడు, పదునొకొండవనాడు పాండవులు పన్నిరి. ఆరవనాడు కౌరవులు పన్నిరి. మూడవనాడు పన్నెండవనాడు కౌరవులు గరుడ వ్యూహమును తీర్చిరి. ఆరవనాడు పాండవులు మకర వ్యూహమును పన్నిరి. కౌరవులు ఐదవనాడు, పదునారవనాడును పన్నిరి. అర్ధేందు వ్యూహ మొక్క పాండ వులచేతనే మూడవనాడు మరియు పదునారవనాడును పన్నబడినది. చక్ర

శకట వ్యూహములను పదునొకండు, పదుమూడు పదునాల్గు దినములయందు కౌరవులు పన్నుకొనిరి. మరియు వారు సర్వతోభద్ర వ్యూహములను తొమ్మిదవనాడు పదునెనిమిదవనాడును పన్నిరి. క్రౌంచ మకర వ్యూహములు రెండు మాత్రమే కౌరవ పాండవు లుభయులును పన్నిన వ్యూహములు.

భీష్ముని పది దినముల యుద్ధములో ఉభయ పక్షములవారును పన్నిన వ్యూహములు—కౌరవ పాండవులు వరుసగా మొదటినాడు మానుష అచల వ్యూహములు; రెండవనాడు పాండవులు మాత్రమే క్రౌంచ వ్యూహము; మూడవనాడు గరుడ అర్ధేందు వ్యూహములు; నాల్గవనా డసలు వ్యూహరచన లేదు; ఐదవనాడు మకరశ్యేన వ్యూహములు; ఆరవనాడు క్రౌంచ మకర వ్యూహములు; ఏడవనాడు మండల వజ్ర వ్యూహములు; ఎనిమిదవనాడు కూర్మ శృంగాటకములు; తొమ్మిదవనాడు కౌరవుల పక్షమేసర్వతో భద్ర వ్యూహము నొనర్చెను; పదియవనా డసలు వ్యూహరచన లేదు. మానుష అచల వ్యూహములు ఒకదాని కొకటి తగిన బంధుర వ్యూహములు. గరుడ అర్ధేందు వ్యూహములును ఒకదాని కొకటి తీసిపోనివి. మకర శ్యేన వ్యూహములు పెద్ద విశేషము కలవిగా లేవు. మకర వ్యూహమునకు ప్రతివ్యూహము క్రౌంచవ్యూహము. మండల వజ్ర వ్యూహములు రెండును ఒకపాటివి. కూర్మ వ్యూహమునకు శృంగాటక వ్యూహము ప్రతివ్యూహము.

భిన్న భిన్న వ్యూహములు పన్నబడిననాటి యుద్ధములును భిన్న భిన్నములుగా వర్ణింపబడవలయును. తిక్కన్నగారియం దట్టి ప్రయత్నము కనిపించుటలేదు. అదియునుగాక ఇందొకటి రెండు తప్ప మిగిలిన వ్యూహములు అంత ప్రయోజనకారులుగా కూడ కనిపించుటలేదు. సంస్కృత భారతమును మించి ఈ తెనుగు భారతమునందు వ్యూహములు చిత్ర విచిత్ర విన్యాసములతో వర్ణింపబడిన వని లోకమున నొక ప్రథ యున్నది. పరిశీలించినమీదట అట్టిదేమియు ననిపించుటలేదు.

క్రౌంచ వ్యూహమున చంచుత్వమును భజించియుండువాడు చాల గట్టివాడుగా నుండవలయును. అట్టిచో నతడు శత్రుసేనలను సులభముగా నురుమాడగలడు. రెండవనాటి యుద్ధమున అర్జునుడు చంచుత్వము భజించి కౌరవ సేనలను కలచిన మాట నిజమే. మరి ఆరవనాడు పాండవుల మకర

వ్యూహమునకు భీష్ముడు ప్రతివ్యూహ మూహించి క్రౌంచమును పన్ని అందు చంచుత్వము భజించుచు తాను నిలబడినాడు. నిలబడినాడే కాని శత్రుసంహార మాయన ఆనా డెక్కువగా చేసిన దేమియును లేదు. మరియు ఆనాడు భీముడు కురుకుమారులను మూకచావుగా చంపినాడు. భీష్ము డక్కడగూడ అడ్డుపడ లేదు. ఇక చంచుత్వము భజించి ఏమి లాభము ? ఆ వ్యూహ మెంత అను కూలముగా నున్నను భీష్ముడు పాండవులయందలి పక్షపాతముచేత విజృంభించ లేదనవచ్చును. మరి ద్రోణుని మొదటినాటి యుద్ధమున క్రౌంచ వ్యూహమున చంచుత్వము భజించి నిలిచినది అర్జునుడు. ఆనాడు అర్జునుడు గణనీయ ముగా చేసినదిలేదు. ధర్మరాజు చేసినాడు.

"చలమేది కౌరవ సైన్యముల్ వాటెడు
ధర్మనందనుని యుద్దండవృత్తి గంటె ? (ఆ1. ప. 199)"

అని ద్రోణు డశ్వత్థామతో అనినాడు. చంచుత్వము భజించి ధర్మరాజు లేడు. ఉన్న అర్జునునకంటె లేని ధర్మరాజే గణనీయముగా విజృంభించినాడు. విజృంభణము లేకపోవుటయే కాదు. ఆనాడు పెద్దగా అర్జునుడు చేసిన యుద్ధ మేమియు వర్ణింపబడలేదు. ఈయన్నింటిని బట్టిచూడగా వ్యూహప్రయోజనము మీద దృష్టిపెట్టి విశిష్టముగా యుద్ధము వర్ణింపబడినజాడ కానవచ్చుటలేదు.

ఇంకను గరుడవ్యూహము కొంత పొసగియున్నది. మూడవనాడు భీష్ముడు గరుడవ్యూహమును పన్ని తా నగ్రభాగమున నిలచి మిక్కిలిగా పరా క్రమించినాడు. ఆనాటి భీష్ముని తీవ్రతకు తాళలేక శ్రీకృష్ణుడు చక్రము తీసి కొని రంగమునకు దూకవలసివచ్చినది. మరియు పన్నెండవనాడు ద్రోణుడు గరుడవ్యూహమును పన్ని తా నగ్రభాగమున నిలచి పాండవానీకమును నిలువ రించి పోరాడినాడు. ఆ యుద్ధము వినుచున్న "ధృతరాష్ట్రుం డచ్చెరువడి యిట్లుపేర్చిన యాచార్య శౌర్య భుజవీర్యంబులు సైరింప నక్కడ నెవ్వరు లేరై రిగదే" (వ. 300) అని ఆశ్చర్యసంతప్తు డైనట్లు చెప్పబడియున్నది. ద్రోణుని నాటి యుద్ధవిజృంభణవిధానమున కావాక్య మొక నిదర్శనము. ఇట్లు గరుడవ్యూహము భీష్మద్రోణులచేత పన్నబడినది. ఆయాదినములందు వారు ద్విగుణముగా శత్రుసంహారము చేయుట కా వ్యూహము లెంతయు అనుకూల పడినట్లు రచించబడియున్నది. మరియు అర్ధేందువ్యూహముతో మూడవనాడు

పాండవులు భీష్ముని ఎదుర్కొనలేకపోయిరి. పదునారవనా డదియే వ్యూహమును పన్నుకొని పాండవులు కర్ణు నెదుర్కొని ఆనాటివిజయమంతయును తమదే అనిపించుకొనిరి. ఆనాడు మకరవ్యూహమున నిలిచిన కర్ణుడు, ఐదవనాడు మకరవ్యూహమున నిలిచిన భీష్మునివలె కాలేదు. ఒకేవ్యూహమును పన్నుకొన్న వీరులలో ఒక డోడినాడు. మరొక డోడలేదు. ఈవిధముగా నున్న మహాభారత యుద్ధమునందలి వ్యూహములు ప్రయోజనదృష్టి కలిగి వర్ణింపబడినట్లు చెప్పవలనుకాదు. ఇది ఎట్లో అట్లే వ్యూహభేదములను పురస్కరించుకొని యుద్ధవర్ణనము భిన్నభిన్నముగా చేయబడలేదు.

## యుద్ధవర్ణన

మహాభారతమున ప్రధాన రసము శాంతము. అది నివృత్తి. తిక్కన్న గారు వ్రాసిన పదునైదు పర్వములలో ఐదు పూర్తిగా యుద్ధపర్వములు. పరిమాణమును చూచి మాటాడినచో దాదాపు సగము గ్రంథము యుద్ధవర్ణనకైనదని చెప్పవలయును. యుద్ధ మనగానే వీరము, రౌద్రము, బీభత్సము ఈ మొదలైన రసనిష్యంది భావములు పోషింపబడవలయును. ఇవి ప్రధానములు కావు. శాంతమునకు వీరాదు లంగభూతము లైనవి. ఇంతే కాదు. మిగిలినచోట్ల అక్కడక్కడ గల శృంగారాదికములుకూడ అంగములే. అంగభూతము లైనవి అలంకారప్రాయములు మాత్రమే.

ఒకటి రెండుచోట్ల అయినచో జాగ్రత్తగా అంగభూతములైన రసభావములను అలంకార ప్రాయములుగా నిరూపించవచ్చును. కాని భారతము విషయ మట్టిది కాదు. అయిదు పర్వములమీద భీష్మద్రోణకర్ణాదులగుపది పదునైదు మంది కురుపాండవవీరుల నాలంబన ఉద్దీపన విభావములుగా చేసి పదునెనిమిది దినములపాటు జరిగినయుద్ధమును వర్ణింపవలయును. ఎక్కడగూడ ప్రధానరసమైన శాంతము భంజింపబడునట్లుగా నంగములైన రౌద్రభయానకాదులు రసములుగా పోషింపబడరాదు. అట్లని యుద్ధరసములకు యుద్ధరసస్ఫూర్తి లేకుండ చేయబడరాదు. స్ఫూర్తియే లేనిచో ఇంక యుద్ధవర్ణన ఏమున్నది గనుక? అనగా యుద్ధమును వర్ణించుచు తత్కాలమున తద్రసస్ఫూర్తి కలిగింపబడి అది అట్లే కొనసాగకుండ అరికట్టబడవలయును. అరికట్టబడనిచో ప్రధానరసము దెబ్బతినును. అపుడు నిర్మాణము లేదు. శిల్పము లేదు. కావ్యరసమును కొనియాడుట

లేదు. భారతమున యుద్ధపర్వములను వ్రాయుట అనగా అంతజాగ్రత్తగా వ్రాయ వలయును. తిక్కన్నగా రట్లే వ్రాసిరి. తిక్కన్నగారి యుద్ధపర్వములు రక్తి గట్టుచున్న వనగా అర్థ మదియే. ప్రధానరసభావము పీగిపోకుండ, యుద్ధరస భావముల స్ఫూర్తి నశించకుండ చేసి చేయుటయే ఆయన శిల్పము. అంతగా విస్తరించిన మహాయుద్ధమును వర్ణించుట అందును యుద్ధరసములు పుంజు కోకుండ రచించుట అసామాన్యమైన మహాకవిలక్షణము కాని మరొక్కటి కాదు.

మహాభారతయుద్ధవర్ణనలో గల చమత్కార మంతయు యుద్ధరసము లను పుష్టము కానీయక అదుపుచేయుటలో నున్నది. ఇందు కనుసరింపబడిన మార్గము లనేకములు :

(1) విరుద్ధరసభావసమ్మేళనముచేత — యుద్ధవర్ణనమున యుద్ధరస ములు పుంజుకొనకుండ అడ్డువేయబడిన విరుద్ధరసములలో శృంగార మొకటి. శృంగారభావము యుద్ధతీవ్రతను వెనుకబట్టించినది.

భీష్ముని ఎనిమిదవనాటి యుద్ధ మైపోయినది. అప్పటి యుద్ధభూమిని వర్ణించు పద్య మిట్లు కలదు. (3-162)

"ధరణి నెత్తుట దోగి ఆభరణకాయ
శస్త్రఖండ జాలంబుల చాల నొప్పె
పలుచగాకుండ కుంకుమ మలది పెక్కు
తెఱగు తొడవులు తొడిగిన తెఱవవోలె." (భీ. 3-162)

ఈపద్యమున పూర్వార్ధము వట్టియుద్ధభూమి వర్ణనము. అది ఉపమేయము. యుద్ధభూమి రక్తముతో తడిసినది. నరికివేయబడిన సైనికులయొక్క ఆభరణ ములతోడి మొండెము లంతటను పడియున్నవి. బీభత్సస్ఫూర్తిమత్తయైనరచన అది. దాని నట్లే కొనసాగనీయక అపుటకు ఉపమానము శృంగారాత్మకము ప్రవేశ పెట్టబడినది. ఇది దానికి విరోధరసభావము. దీనిచేత పూర్వార్ధమునుండి ప్రతీతికి వచ్చెడు యుద్ధరసభావ ముపశమింపజేయబడినది. భావశాంతి ఎప్పుడు చేయబడు ననగా అనుభావములచేత పోషింపబడి ఆస్వాదయోగ్యము చేయబడ రానిభావము తప్పక చెప్పబడవలసివచ్చినప్పుడు. అనగా భావచర్వణ మాత్రము నభిలషించినప్పుడు -భీష్ముని ఎనిమిదవనాటి యుద్ధము ముగియునప్పటికి

యద్ధభూమి అంతయు రక్తసిక్తమై భయావహముగా నున్నది. ఈమాత్రము భావము చర్వణయోగ్యమై ఆనాటియుద్ధతీవ్రత హృదయసంవాది కావల యును. కాని దానియందు హృదయము లగ్నము కారాదు. మొదటినాటి నుండియు యుద్ధ వర్ణన వెంటబడివచ్చుచున్న సహృదయున కావద్యము పూర్వార్ధము యుద్ధరసస్ఫూర్తి కలిగించుచున్నది. ఆస్ఫురించుటను వెంటనే తద్విరుద్ధముగా శృంగారాత్మకమైన ఉపమానముద్వారా కవి కావలయు నని కొనసాగ నీయకుండ అరికట్టుచున్నాడు. జుగుప్సాదిభావ మభ్యుదయము పొందకుండ శాంతి పొందింపబడినది. ఇక ఆయుపమేయము ఆఉపమానము ద్వారానే చూడబడును. రసస్థితికి పోనీయకుండ స్ఫూర్తిమాత్రపర్యవసితముగా రసనిష్యందు లైన భావములను నిర్వహించుట యనగా నట్లుండును.

(2) కథానుస్యూతి రక్షణము. – అనగా కథాబీజము మొదటినుండి తుదిదాక విస్తరించియుండునట్లు చూచుకొనుట. మహాభారతమున ప్రధాన కథాబీజము దుర్యోధనుని రాజ్యమునందలి లుబ్ధబుద్ధి. మరియు ధృతరాష్ట్రుని యుపేక్ష. ఈరెండు భావములయొక్క స్థూలరూపములు లాక్షాగృహదహనము, దుర్ద్యూతము, ద్రౌపది వస్త్రాపహరణము మొదలైనవి. వీనిని మొత్తము గ్రంథము మీద విస్తరించిచూపుట యనగా ఎకనెడ పేర్కొనుట యన్నమాట. ఏతా దృశము లైన బీజముల క్రమపరిణామమే ఈయుద్ధము. పాండవుల అరణ్యా వాస కాలము పన్నెండు సంవత్సరాలు అజ్ఞాతవాససంవత్సరము మొత్తము పదుమూడు సంవత్సరాలు ప్రధానకథ ఎదుగుబొదుగులు లేక అట్లే యున్నది. కథ ఆగిపోయినది. తిరిగి యుద్ధముతో కథ సాగుట మొదలైనది. ఆయుద్ధము జరిగిన పదునెనిమిదిదినములును ఏతన్మూలభూతము లైన వెనుకటి కౌరవుల కృత్యములు పాండవులచేత తరచుగా నెమరునకు తీసుకొని రాబడుటతో కథా నుస్యూతి ఎడతెగకుండ రక్షింపబడిన దగుచున్నది. దీనికి రెండుప్రక్కలను పదు నున్నది. ఒకటి ఈపేరుతో యుద్ధరసభావముల విజృంభణమును తిక్కన్నగా రరికట్టగలిగిరి. రెండు పాండవపక్షమున కిది పెద్దఉద్దీపన విభా వముగా చేయబడినది. దీనిని ఆయన రకరకములుగా వర్ణించెను. ఒకచో పాండవవీరుల వీరాలాపము—మరొకచో కౌరవ సైనికులు పాండవుల యందు ఆదరము కలవారని చూపుట—ఇంకొకచో పాండవుల కున్న చేతనాచేతనముల మద్దతును నిరూపించుట– మరియు ముఖ్యముగా శ్రీకృష్ణుని కౌరవద్వేషమును

పాండవప్రీతిని చూపుట-ఇట్టి కథానుస్యూతి పలుమందిచేత పలువిధములుగా రక్షింపబడినది. యుద్ధవర్ణనలో ఇదొక చమత్కార మైన విధానము

భీష్ముని ఎనిమిదవనాటి యుద్ధమున భీముడు లెస్సగా విజృంభించి సునాభుడు మొదలైన కురుకుమారులను ఏడెనిమిదిమందిని హతమార్చినాడు. తమ్ములు పడుటను చూచిన దుర్యోధనుడు శోకాతురుడై భీష్ముని తూలనాడినాడు. అప్పుడు భీష్ము డెదురు శోకించుచు వాని కిట్లనినాడు.

"ఇది మున్న యేను ద్రోణుఁడు
విదురుండును జెప్పినదియ విన వప్పుడు బె
ట్టిదు లగు పాండుతనూజుల
కెదు రై నిర్జింపవశమె యీశున కైనన్.

మనకుమారులలోన నయ్యనిలతనయు
బారి కగపడువాని నెవ్వారి కైన
కావ దలకొన శక్యంబు గాదు మనకు
నడల పనిలేదు దీనికి నధిపతనయ." (3–79, 80)

మొదటి పద్యము కథాబీజమును స్పృశించుచున్నది. రెండవ పద్యము దుర్యోధనుడును దుశ్శాసనుడును భీమునిచేతిలో పడుటను, అప్పుడు వారిని రక్షించువా రెవరును లేకపోవుటను ఊహ కందించుచున్నది. అట్లనుటలో భీష్ముని తాత్పర్య మదియే. అందువలన కౌరవవీరులకు పాండవులయందు పక్ష మున్నదన వలయును. కౌరవుల పక్షమున పాండవులతోడి యుద్ధమున కుత్సాహమంతగా లేకపోవుటనుగూడ భీష్మునితాత్పర్యము స్ఫురింప జేయుచున్నది. ప్రధానరసముదృష్ట్యా అంగరసముల తీవ్రత తగ్గుట కిట్టిచిట్కా లెన్నియో పనిచేసినవి. మరియు ఆనాటియుద్ధమున భీముఁడు సునాభుడు మొదలైనవారిని పడగొట్టుటచూచి దుర్యోధనునకు సాయము చేయవచ్చిన రాజులు తమలో ఇట్లనుకొనిరి.

"నాడు సభ నాడినంతయు నేడ చేయు
నట్టు లున్నాడు మొనతల ననిలసుతుడు
విదురుపలుకులు తలకూడె వేయు నేల
అనుచు వెఱజూచుచుండిరి మనుజపతులు" (3-74)

మరియు భీష్ముని తొమ్మిదవనాటి యుద్ధమున కౌరవసైనికులు తమలో ఇట్లనుకొనిరి.

"ధృతరాష్ట్రిందును పుత్రులు
నతిలోభంబున ప్రజాక్షయము చేసిరి ధ
ర్మతనూజు గెలువవచ్చునె
మతి లేరై రింక నేటి మాటలు మనకున్." (3-227)

ఈవిధముగా ప్రధానకథాబీజము, కౌరవ సేనానాయకులయొక్కయు సైనికుల యొక్కయు, తోడువచ్చిన వారియొక్కయు ముఖములనుండి వెలికి తీసుకొని రాబడి యుద్ధరసభావములు మాటిమాటికి అదుపులో నుండునట్లు చూడబడినవి. ఈదృశమైన కథానుస్యూతి రక్షణము కౌరవపాండవుల మనోభావముల నభివ్యక్తము చేసినది. యుద్ధముయొక్క తీవ్రానుభూతిని అరికట్టినది. పాండవ విజయమును కౌరవుల ఓటమిని ఒకటికి పదిసార్లు హెచ్చరించినది. యుద్ధపర్వములను చదువుచున్నవానికి ఆది సభాపర్వములు అరణ్య విరాటోద్యోగ పర్వములతోసహా మనసుస్సులో దిరుగునట్లుగా యుద్ధము వర్ణింపబడినది.

3) యుద్ధకథాకథన విధానము—యుద్ధరసములు పుష్టములై ఆస్వాద్యములు కాకుండ చేయుటలో ప్రముఖపాత్రనే నిర్వహించినది. యుద్ధకథాకథనము రెండు విధములు. సంజయుడు ధృతరాష్ట్రినకు చెప్పుట ఒకటి. వైశంపాయనుడు జనమేజయునకు చెప్పుట మరొకటి. ఈరెండింటి వలనను యుద్ధ విషయ మూవబడి అన్యవిషయము ప్రవర్తించుటకు వీలుకలిగినది. సంజయుడు చెప్పుచున్నప్పుడు దుర్యోధనుని చేతలు తలచుకొని ధృతరాష్ట్రిడు దుఃఖించుటయు, ఇదంతయు నీవల్లనే అయిన దని సంజయుడు మర్మములు నాటనాడుటయుగా నుండును. ఇది కథాబీజము స్పృశింపబడుటయే. ఈవిధముగా పాఠకుల బుద్ధి యుద్ధమును వదలి అన్యవిషయముల యందు ప్రవర్తించునట్లుగా చేయబడి యుద్ధరసభావములు రసములుగా పరిణమించకుండ ఎక్కడికక్కడ తెగదెంపులు చేయబడుటను మనము గమనింపవచ్చును. మరియు కొన్నిచోట్ల సంజయుని సమాధానములు ధృతరాష్ట్రునిపట్ల చపేటములవలె నగుచు చమత్కారకారిత్వము కలిగి తళతళ లాడుచుండును. భీష్మునియారవనాటియుద్ధమును వినుచు ధృతరాష్ట్రిడు తన సహజధోరణిలో పశ్చాత్తాప దుఃఖమును ప్రకటింపగా సంజయు డనినాడు.

"నీతనూభవుండు నెఱిగుఱి యెఱుగమి
యెఱిఁగి యెఱిఁగి యతని నేల చెప్ప?
మనయుపేక్షవలన విను నాటి జూదంబ
నేడు కయ్య మయ్యె నృపవరేణ్య." (2-355)

ఈపద్యమున చమత్కార మంతయు మనయుపేక్షలో నున్నది. లోకమురీతి రెరిగి దానిని భావించినచో సంజయు డెంత ఆక్షేపించి మాటాడుచున్నాడో తెలియును.

సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుటయే కథనము. ఆయన యుద్ధ భూమినుండి వచ్చు సందర్భమునను, కథన ముపక్రమించుటకు ముందును ఆయిరువుర శోకసంతప్తత వర్ణింపబడును. సంజయుడు వచ్చువాడు సేనాపతి మరణమును పేర్కొని దుఃఖించుచు వచ్చును. అది విని ధృతరాష్ట్రుడును దుఃఖించును. ఈవిధముగా యుద్ధకథనము కరుణనాదములతో మొదలగు చుండుటకూడ యుద్ధోల్బణము నరికట్టుచున్నది.

4) కౌరవ పాండవ శిబిర వృత్తాంతము.—యుద్ధావసానమునకు యుద్ధ ప్రారంభమునకు మధ్య అనగా రాత్రిసమయమున కౌరవపాండవ శిబిరము లందు జరుగు వృత్తాంత కథనముకూడ యుద్ధము కాని అన్యవిషయమై యుద్ధ రసభావముల తీవ్రతను తగ్గించుచున్నది.

ఎనిమిదవనాడు యుద్ధ మైపోయినది. దుర్యోధనుడు కర్ణుని బిలిపించు కొని మాటాడినాడు. ఇక యుద్ధమునుండి భీష్ముని విరమింపజేయుము. నేను వచ్చెదను అని కర్ణుడు ధైర్యము చెప్పగా దుర్యోధను డామాటలు నమ్మకము పట్టుకొని అప్పుడే భీష్ము డున్న శిబిరమునకు పోయి (3-170, 171) నీవలన లాభము కనిపించుటలేదు.యుద్ధమునుండి విరమించుకొనుము.నీవు వైదొలగినచో కర్ణుడైనను వచ్చును నీవలన ఉభయభ్రష్టుడ నగుచున్నాను. అని దుర్యోధను డనగా అందుకు భీష్ము డిట్లనినాడు. గాండీవిని గెలువరాదు. శిఖండిని చంప వీలులేదు. ఇక మిగిలినవారిని సంహరింతును. ఈ మాట నీకు మొదటనే చెప్పి తిని. నీవు పాండవులను సంహరింపుము. నేను పాండవసైన్యమును రూపు మాయింతును, అంతేగాని ఈ అర్ధరాత్రిపూట వచ్చి నన్ను నిందించిన ఫలి

లాభము? భీష్ముని మాటలలో సరే యుద్ధమునుండి విరమించుకొందు నని లేదు. సేనాపతులయందు ప్రభువునకు విశ్వాసము లేదు. ప్రభువునకు కూర్చుటయందు సేనాపతుల కిష్టములేదు. విశ్వాసము లేని ప్రభువు ఇష్టము లేని సైన్యమును పెట్టుకొని కొనసాగించెడు యుద్ధముగా కౌరవపక్షమునుండి శిబిరవృత్తాంత కథన రూపముగా భారతయుద్ధము చూపబడినది. ప్రధాన కథాతాత్పర్యము దృష్ట్యా అంగ విషయ నిర్వహణమునం దిది యొక నేర్పరితనము. ఈ విధముగా శిబిరవృత్తాంతకథనము పాఠకుల మనస్సులను అన్యవిషయములయందు ప్రవర్తింప జేసి యుద్ధరసభావముల యనుభవమునుండి తప్పించుచున్నది.

## ప్రధానవీరుల పోరు

రెండవనాటి యుద్ధమున భీష్మార్జునులు తీవ్రముగా నెదుర్కొనిరి. వారి యుద్ధమును చూచి సిద్ధచారణగంధర్వాదులు తమలో తా మిట్లనుకొని రని తిక్కన్నగా రొక పద్యము వ్రాసిరి.

"ఒండొరు చండవిక్రమము లోర్తురు వీరల కాక వీరితో
నొండొకరుండు మార్కొనగ నోపునె పూని కృతాంతుఁడైన నా
ఖండలుఁడైన నివ్విధపు కయ్యము లెక్కడ నైన గంటిమే
పాండవ కౌరవోత్తముల బాహువిలాసము లిట్టు లుండునే—" (2.47)

భీష్మార్జునులలో ఎక్కువ తక్కువలు లేవు. ఒకరి కొకరు తీసిపోని పోటుమానిసులు వారు. భీష్మార్జునుల యుద్ధ మెంతసేపు వర్ణించినను అది ఇట్లే యుండును. మొదటినాడును భీష్మార్జునులయుద్ధ మున్నది. అచట తిక్కన్నగా రిట్లు వ్రాసిరి.

"కొఱవియు కొఱవియుఁ దాకిన
తెఱఁగున నర్జునుఁడు సురనదీసూనుఁడు చూ
పఱు వొగడఁ దాకుటయు ని
ద్దఱ దిక్కుల సైన్యములును దలవడియెన్." (1-238)

ఇది భీష్మార్జున వీరుల యుద్ధవర్ణనము. భీష్ముడు దేవతలు మెచ్చుకొనునట్లు అర్జునునకు తీసిపోక యుద్ధము చేయును. ఆయన మహాస్త్రము లేవియు ప్రయోగింపడు.

భీష్మునితో పేర్కొనదగిన యుద్ధమును భీముడుగాని ధర్మరాజుగాని చేయలేదు.

## ప్రకృతివర్ణనలు

యుద్ధపర్వములలో ఏమి ప్రకృతివర్ణనలు చేయుటకు వీలుండును? యుద్ధము సూర్యోదయముతో ప్రారంభ మగును. సూర్యాస్తమయముతో పరిసమాప్త మగును. అందువలన ఎన్ని దినములు యుద్ధము జరిగినదో అన్ని దినములును సూర్యోదయ సూర్యాస్తమయములు సూచింపబడవలయును. ఈ పర్వములలో కవికి వర్ణించుట కున్న ప్రకృతి తావన్మాత్రమే. ఆ యవకాశమును పనిగట్టుకొని అదేపనిగా విస్తరించి వర్ణించరాదు. అవి యుద్ధారంభమునకును యుద్ధవిరమణమునకును సూచనలు అంతమాత్రమే. ఒకగంట కొట్టియైనను ఆ సూచనమును నిర్వహించవచ్చును. గంట కొట్టుటను ఎంత విస్తరించి వర్ణించుటకు వీలున్నదో తాదృశ్యములైన సూర్యోదయ సూర్యాస్తమయములను వర్ణించుట కంతకంటె ఎక్కువ లేదు.

ప్రకృతి జడము. వర్ణన మనగనే అది సగుణ మగుచున్నది అట్లు సగుణము చేయబడినప్పు డది ఆయాప్రకరణముల కనుకూలమై గ్రంథసందర్భములను దీప్తికి తేవలయును. ఆ విధమైన ప్రకృతివర్ణనమే వర్ణనము. అనగా కవి తన ఊహాశక్తి చేత జడమునందు చేతనతను కల్పించి దానిని కావ్యార్థము నుద్దీప్తిహేతువుగా నిర్వహించుటయే శిల్పము. తిక్కన్నగా రీ పర్వమున ఈ విషయమును చక్కగానే నిర్వహించినారు.

"సోమాన్వయ ప్రదీపకుఁ
డీ మెయి తేజోవిశేష మెసకం బెసగం
గా మెఱయుట గనుగొని సి
గ్గై మఱువడు మాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్."

దీనికి మీద ఒక పద్య మున్నది. (1-293, ·69)

'శాంతనవుఁడు తేజోదు
ర్దాంతుం డై నా వెలుంగు ధర కెల్లను జా
లింతు నినుఁ డస్తశైలో
పాంతమునకు జనిన నేమి యని నట్టుండెన్."

పై పద్యము తరువాత ఇంకొక పద్య మున్నది (౩౦౦)

"జలరుహంబులు పాండవ సైనికుల మొ
గంబు లట్టుల విన్న నై కాంతి దఱిగె
వారి మనముల భీత్యంధకార మడరు
కరణి జీకటి యెడనెడ గవియుదెంచె".

ఈ మూడు పద్యములను మొదటిదినము సాయంకాలము యుద్ధము సమాప్త మగుటను చెప్పుచున్నవి. భీష్ముడు మొదటినాడు తీవ్రముగా విజృంభించి యుద్ధము చేసినాడు. అతడు రెండవసూర్యునివలె వెలిగిపోవుచున్నాడు. ఈ సూర్యు డస్తమించినచో ఏమియు కాదు. నే నున్నానుగదా అన్నట్లున్నాడు. భీష్ముడు చంద్రవంశములోనివాడు. తనముందు చంద్రుడే నిలువలేకుండ పోవు చున్నాడు. కాని ఇపు డీ భీష్ము డాతని వంశమున పుట్టినవాడు. తనను మించి వెలుగుచున్నాడు. ఈ పరిస్థితికి సూర్యుడు సిగ్గుపడినాడు. ఇక మొగము చూపించలేక చాటుచేసికొనినాడా అన్నట్లుగా అస్తంగతు డైనాడు. సూర్యాస్తమయము కాగా పద్మములు ముడుచుకొనును పాండవసైనికుల మొగములకు వలె ముడుచుకొన్నవి. చీకట్లువచ్చినవి. ఎట్లనగా పాండవపక్షము వారి మన సులనుండి భీత్యంధకారము వెలికివచ్చినట్లు.

మరియు నీ పద్యము లేమి చెప్పుచున్న వనగా ఆ రోజంతయు యుద్ధము చేసిన భీష్ముని చెప్పుచున్నవి. తత్ఫలము ననుభవించిన పాండవులను చెప్పు చున్నవి. మొదటినాటి యుద్ధము సమాప్తమగునప్పటి కున్న ఉభయపక్షముల పరిస్థితిని ఆ పద్యములు వ్యక్తముచేయుచున్నవి. భీష్ముడు సూర్యుడు జీవలోక మునువలె పాండవపక్షమును తపింపజేసినాడు. సూర్యుడు చూచి సిగ్గుపడవలసి నంత తేజోవిశేష మానాడు భీష్మునియందు వెలికివచ్చినది. సూర్యుడు సిగ్గుపడు టను కవి ఆపాదించి చెప్పుచున్నాడు.ఇట్లు చెప్పుటద్వారా భీష్ముని యుద్ధతీవ్రతను స్ఫురింపజేయుచున్నాడు. నిజముగా భీష్ము డంతగా విజృంభించినాడా? అవును. అందువల్లనే ఆనాటి రాత్రికి ధర్మరాజు శ్రీకృష్ణునివద్దకుపోయి తానిక యుద్ధమును విరమించు కొనుటనుగూర్చి చెప్పెను. భీష్ముని యుద్ధమునుచూచి ధర్మరాజు భయ పడినాడు. సూర్యుడు సిగ్గుపడుట యనగా ధర్మరాజు భయపడుట యని యర్థము

ధర్మరాజు వెలుగుపడుటను సమర్థించునట్లుగా కవి సూర్యాస్తమయము నూహించి వ్రాసెను. భీష్మునిచేతిలో దెబ్బతిన్న పాండుసైనికుల మొగములు సూర్యు డస్తమించిన పద్మములు. భీష్మునితో పోరుట అసాధ్యముగా నున్న దని వారు భయపడినారు. ఆభయమే చీకటి. ఈవిధముగా ప్రకరణమునకు దీప్తి కల్గించు విధముగా ప్రకృతి విషయముల నుచిత రమణీయముగా వర్ణించుట శిల్పపారగుని పని.

భీష్ముని తొమ్మిదవనాటి యుద్ధమునను సూర్యాస్తమయ మైనది.

"తానస్తశిఖరి మఱువడఁ
బోనియపుడు పాండురాజపుత్రవిరాజ
త్సేన పొద వడఁగు నను కృప
నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా !" (3-270)

తొమ్మిదవనాడుకూడ భీష్ముడు తీవ్రముగానే యుద్ధము చేసినాడు. ఆపది దినముల యుద్ధములో శ్రీకృష్ణుడు చక్రము తీసికొని భీష్ముని సంహరింతు నని పూనికచేయుట రెండవసారి జరిగినరోజది. కృష్ణుడు యుద్ధమున మూడవనాడట్లే భీష్మునిమీదకు పోయినాడు. —ఈసూర్యాస్తమయ పద్యమును మొదటినాటి పద్యముతో పోల్చి చూడవలయును. ఆపద్యములో పాండవుల ప్రసక్తి లేదు. ఈ పద్యమున నున్నది. భీష్మునియుద్ధము పదిదినములు గనుక పది సూర్యాస్తసమయము లున్నవి. ఈరెండురోజులలో తప్ప మరొకనా డవి ఈవిధముగా కథా పురుషుల తత్కాలపు స్థితిగతివిశేషముతో జోడించి వర్ణింపబడలేదు.

పాండురాజపుత్ర విరాజత్సేన పొద వడగునను కృపతో సూర్యు డస్తమించుట ఉహింపబడినది. ప్రకాశించుచున్న సేన, విక్రమించుచున్న సేన అని విరాజత్సేన కర్థము. ప్రకాశింపతగినసేన అనికూడ చెప్పవచ్చునా? ప్రకాశించుచున్న సేన విక్రమించుచున్న సేన నశించు నని సూర్యునకు దయకలిగినది. అంతవరకు పాండవసేన విజృంభించుచునే యున్నది. ఆ విజృంభణము పొదవడగుటకు దగ్గర పడుచున్నది. ఇక విక్రమము చూపలేనిస్థితి రాబోవుచున్నది. సూర్యు డస్తమించినాడు. దీనికంతకు తాత్పర్య మేమనగా పాండవసేన విక్రమించి శత్రునాశనము చేయవలయు నని సూర్యుని అభిలాష యని. అదే కృప. సూర్యునకు కృప యేమి? కవిచేత ఆపాదింపబడినది.

ఆనాటిరాత్రి ధర్మరాజుచేత ప్రార్థింపబడి భీష్ముడు పాండవులయందలి ప్రీతిచేత తాను యుద్ధమునుండి విరమించుటకు వా రేమి చేయవలెనో చెప్పి మరునాడు యుద్ధమునుండి విరమించినాడు. తనవలన పాండవసేనాబలము రూపు మాసిపోగలదు. తా నట్లు విజృంభించి యుద్ధము చేయరాదు. వారు మాసిపోదగిన వారు కారు. వారు ధర్మాత్ములు. ఆవిధముగా భీష్మునకు పాండవులపట్ల కృప యున్నది. అందువల్లనే ఆయన మిక్కిలిగా విక్రమించుటయే లేదు. ఆమాత్రము తాకుటనే వా రోర్చుకొనలేక పోవుచున్నారు- భీష్మునకు పాండవులు జయించుట యిష్టము. తాను యుద్ధరంగమున ఉన్నంతకాలము పాండవులు జయించలేరు. అందువలన తాను యుద్ధమును విరమించుట కొక ఉపాయమును ధర్మరాజుకు చెప్పినాడు.

మొదటినాటి యుద్ధావసానమునకు భీష్ముడు తేజోవిరాజితు డైన సూర్యుడు. తొమ్మిదవనాటి యుద్ధావసానమునకు సూర్యుడు పాండవులయందలి దయచేత అస్తగిరిమాటుకు పోయినాడు. అనగా భీష్ముడు పాండవులయందలి దయచేత ఆరాత్రికి ధర్మరాజుచేత ప్రార్థింపబడి యుద్ధమునుండి విరమించుకొనబోవుటను వ్యంజింప జేయుచున్నది. నిజముగా పాండవులయందు దయగలవాడు భీష్ముడు. అది సూర్యునియం దారోపించబడినది. దీనిమొత్తము తాత్పర్య మిట్లు: భీష్ముడు సూర్యునివలె ప్రతాపోష్మము కలవాడు. తా నింక యుద్ధమునుండి విరమించనిచో పాండురాజపుత్రులయొక్క విరాజత్సేన రూపుమాసిపోవును. అది కూడదు అని తొలగినాడు. అది ఎట్లున్నదనగా పాండవులందలి దయచేత సూర్యుడు తన వెలుగుల నుపసంహరించుకొని అస్తంగతుడైన ట్లున్నది. సూర్యాస్తమయమైన దనగా యుద్ధము ముగిసినట్లు. ఆతరువాతకూడ ఎనిమిది దినములు యుద్ధము జరిగినది. అయినను అది పాండవుల కంత భారము కాదు. భీష్మునితీవ్రతవంటి తీవ్రత తరువాతి కౌరవసేనావీరులలో లేదు. భీష్మునకు పాండవులయం దున్నంత కృప మరి యేకౌరవపక్షమునందలి ఇతర వీరునకును లేదు.

పాండవులయందు జాలిగొని సూర్యు డస్తమించుట ఆ పదునెనిమిది దినములయుద్ధములోను ఒక్క ఈ తొమ్మిదవనాడే చెప్పబడినది. భారతయుద్ధమున భీష్ముడు ప్రదర్శించిన తీవ్రతను, పాండవులం దున్న వానిదయ మున్నగు వాటిని క్రమముగా సూర్యునియం దున్నట్లు అస్తమించుటయందు రూపించుచు

రెండు పద్యములు వ్రాసి తిక్కన్నగారు కావ్యగౌరవమును ప్రకరణౌచిత్యమును గల వర్ణనము నిమిడ్చి సాధించినారు. వర్ణనములయం దౌచిత్యమునా నిట్లుండవలెను.

### శిఖండి

విచిత్రవీర్యుని కొరకని భీష్ముడు కాశీరాజుకూతుండ్రను ముప్వురను అంబ - అంబిక - అంబాలిక అనువారిని బలిమిమై గొనివచ్చెను. అంబ అంతకు ముందటినుండియు సాళ్వు డనువానిని ప్రేమించుచున్నది. ఆమాట ఆమె భీష్మునకు చెప్పగా అందుకు సమ్మతించి ఆయన ఆమెను సాళ్వునివద్దకు పంపినాడు. ఇతరులకొరకు వరియింపబడి గొనిపోబడినందున అంబను సాళ్వు డంగీకరింపలేదు. ఒకరి నామె కా దన్నది. ఆమెకోరినవా డామెను కాదనినాడు. ఆమె రెంటికిం జెడినది.

అంబకు భీష్మునిమీద కోపము వచ్చినది. వానిఅంతు చూడవలయు ననుకొన్నది. ఘోరముగా తపస్సు చేసినది. ఆమెకు రుద్రుడు ప్రత్యక్షమై ఆమె కోరిన వరము నిచ్చెను. ఆ కోరిక సిద్ధించుట కామె ద్రుపదమహారాజుకు కూతురై పుట్టెను. వరముప్రకార మా తరువాత పురుషుడుగా మారును. ఎట్లును పురుషుడుగా మారుట కలదు గనుక చిన్నతనమునుండి ద్రుపదు డా పిల్లను పిల్లవాడట్లు పెంచెను. అందరును పురుషు డనియే అనుకొనుచున్నారు. ద్రుపదుడు తొందరపడి దశార్ణదేశాధీశుని కుమార్తెను తెచ్చి తనకొడుకునకు వివాహము చేసెను. ద్రుపదమహారాజు కొడుకు పురుషుడు కాదనియు స్త్రీ అనియు పెండ్లికూతురు కనిపెట్టినది. ఆమె తనతండ్రి కావిషయ మెరింగించినది. ద్రుపదుడు తనను మోసముచేసినా డని మండిపడి యుద్ధమునకు సిద్ధమై వచ్చెను. పాపము ద్రుపదునికొడుకువేషముకూతున కిది అంతయు అవమాన మనిపించి ఆమె అడవులుపట్టిపోయినది. అచ్చట ఆమె కొక యక్షుడు కనిపించి ఆమెయందు జాలికలవాడై కొంతకాలమునకు తనపుంస్త్వమును ఆమె కిచ్చి ఆమె స్త్రీత్వము తాను స్వీకరించెను. ఆవిధముగా ఆమె తనస్త్రీత్వమును విడిచి పురుషుడైనది. స్త్రీగా ఉన్నప్పు డామెపేరు శిఖండిని. పురుషుడుగా మారగానే పేరును మారి శిఖండి యైనది. **శిఖండి** యనగా భీష్ముని వధించుటకుగాను ద్రుపదునకు కూతురుగా బుట్టి కొడుకైన

అంబ యన్నమాట. అట్లు పురుషుడుగా ఉండుటకు కొంతకాలమే శిఖండికి వీలున్నది. ఆ గంధర్వునకు శిఖండినికిని జరిగిన ఒప్పందములో ఆ కాలనియమమున్నది. కాని శిఖండి ఎప్పటికి పురుషుడుగానే ఉండిపోయెను. ఎట్లనగా—శిఖండినిస్త్రీత్వము తీసికొన్న యక్షుడు తిరిగి నగరమునకు పోలేదు. ఆ వనమునందే యుండెను. కుబేరుడు వానిని వెదకుకొనుచు ఆవనమునకు వచ్చెను. కుబేరుడు తనను పిలిపించునంతకు వాడు స్వామిని చూడబోలేదు. కుబేరునకు కోపము వచ్చి ఈ స్త్రీవేషముతో నిట్లే ఎల్లకాలము నుండు మని శపించెను. అందువలన యక్షుడు పురుష డగుటకు లేదు. కావున శిఖండి స్త్రీ యగుట లేదు. ఆ విధముగా శిఖండి పురుషుడైనాడు. శిఖండి మరణించినతరువాతగాని యక్షుడు పురుషుడు కాడు. శిఖండి ద్రోణాచార్యునివద్దనే ధనుర్విద్యలు నేర్చెను శిఖండితో భీష్ముడు యుద్ధము చేయడు. అది యొక ప్రతిజ్ఞ.

## భీష్మవధ

యుద్ధ మింకను మొదలు కాలేదు. కాబోవుచున్నది. ధర్మరాజు పాదచారియై భీష్మునివద్దకు పోయి అతని కిట్లనెను.

'అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడ నై
ము న్ననుజ్ఞ గొనఁగ నిన్ను గాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన
వడసి చనిన నేను పగఱ గెలుతు.' (1-156)

'అన విని గాంగేయుఁ డక్కట నీ విట్లు
సనుదేక తక్కిన శాప మిత్తు
వచ్చితి మే లయ్యె వైరుల నిర్జింపు
మిఁగాకయును వర మెద్దియైన
నడుగుము నీకుగా నని సేయు టొక్కటి
దక్కంగ నావుడు ధర్మసుతుఁడు
రారాజుపక్ష మై రణము సేయుము నాకు
హిత మగు కార్యంబు మతిఁ దలంపు

మనుడు నట్లుకాక యట నీతలం పేమి
యనిన భీష్ముతోడ సతఁడు నిన్ను
పోర గెలుచువిధము బోధింపు మనుటయు
సస్మితాస్యుఁ డగుచు శాంతనవుఁడు.' (1.157)

భీష్మవధావిధానమున కివి రెండు పద్యములును బీజభూతములు. ధర్మరాజు యుద్ధము చేయుటకు భీష్ముని అనుజ్ఞ కావలయునా? అది దీవనవంటి దనియు ధర్మరా జనుచున్నాడు. అందువలన ధర్మరాజు శత్రువులను జయించును. ధర్మరాజు శత్రువులను జయించునట్లుగా భీష్ము డాశీర్వదింపవలయును. అదే యుద్ధముచేయుట కనుమతి.

ధర్మరాజు సమరకౌతుకి. ఆయనకు జయము కావలయును. భీష్ముడు కౌరవపక్షమున సేనానాయకుడై యుండియు ధర్మరాజు జయించుటను కోరుచున్నాడు. యుద్ధమునకు ముం దొకసారి ధర్మరాజు వచ్చి తనతో మాట్లాడిపోవలయు నని భీష్ముడు మనస్సులో గాఢముగా ననుకొనినాడు. భీష్ము డనుకొన్నట్లే ధర్మరాజు పోయినాడు. భీష్మునకు చాల సంతోషమైనది. శత్రువులను జయించునట్లు యుద్ధముచేయుట కనుజ్ఞ యిచ్చినాడు. "వైరుల నిర్జింపుము" —ఎవరు వైరులు? తా నెవరికి సేనానాయకత్వము వహించినాడో వారే శత్రువులు. తనను జయించినచో పాండవులు శత్రువులను జయించినట్లే. పాండవులు శత్రువులను జయింపవచ్చును. పాండవులు తనను జయింపవచ్చును. తాను వారిని జయించుమాటయే లేదు ఈ పునాదిమీద భీష్మపర్వము నడచినది. పదిదినములయుద్ధము కొనసాగినది. ధర్మరాజు భీష్ముడు రారాజు పక్షమే యుండవలయును. అటుండి ఇటు తన కాయన హితమును చేయవలయును. శల్యునివిషయమునకూడ ధర్మరా జిట్లే కోరినాడు.[18] శల్యునితో నీ విట్లిట్లు చేయమన్నట్లు ధర్మరాజు భీష్మునితో అనలేదు. అందుకే నీ ఆంతర్యమేమిటో చెప్పు మని భీష్ము డడిగినాడు. భీష్ముడు తనను యుద్ధమున గెలుచునుపాయము బోధింపవలయును. అది ధర్మరాజు ఆంతర్యము. భీష్ముని ఎవరును జయించలేరు. ఆ విషయము ధర్మరాజుకు తెలియును. అందుకే ఇట్లు ప్రార్థించుట. నిన్ను యుద్ధములో గెలుచు ఉపాయము నీవు చెప్పకున్న మేము నిన్ను గెలువలే మనగానే భీష్మునకు చిన్ననవ్వు వచ్చినది. తన మహనీయ

18. ఉద్యోగపర్వము 1—109, 110

ఆనాటిరాత్రి ధర్మరాజుచేత ప్రార్థింపబడి భీష్ముడు పాండవులయందలి ప్రీతిచేత తాను యుద్ధమునుండి విరమించుటకు వా రేమి చేయవలెనో చెప్పి మరునాడు యుద్ధమునుండి విరమించినాడు. తనవలన పాండవసేనాబలము రూపు మాసిపోగలదు. తా నట్లు విజృంభించి యుద్ధము చేయరాదు. వారు మాసిపోదగిన వారు కారు. వారు ధర్మాత్ములు. ఆవిధముగా భీష్మునకు పాండవులపట్ల కృప యున్నది. అందువల్లనే ఆయన మిక్కిలిగా విక్రమించుటయే లేదు. ఆమాత్రము తాకుటనే వా రోర్చుకొనలేక పోవుచున్నారు- భీష్మునకు పాండవులు జయించుట యిష్టము. తాను యుద్ధరంగమున ఉన్నంతకాలము పాండవులు జయించలేరు. అందువలన తాను యుద్ధమును విరమించుట కొక ఉపాయమును ధర్మరాజుకు చెప్పినాడు.

మొదటినాటి యుద్ధావసానమునకు భీష్ముడు తేజోవిరాజితు డైన సూర్యుడు. తొమ్మిదవనాటి యుద్ధావసానమునకు సూర్యుడు పాండవులయందలి దయచేత అస్తగిరిమాటుకు పోయినాడు. అనగా భీష్ముడు పాండవులయందలి దయచేత ఆరాత్రికి ధర్మరాజుచేత ప్రార్థింపబడి యుద్ధమునుండి విరమించుకొన బోవుటను వ్యంజింప జేయుచున్నది. నిజముగా పాండవులయందు దయగలవాడు భీష్ముడు. అది సూర్యునియం దారోపించబడినది. దీనిమొత్తము తాత్పర్య మిట్లు: భీష్ముడు సూర్యునివలె ప్రతాపోష్మము కలవాడు. తా నింక యుద్ధమునుండి విరమించనిచో పాండురాజపుత్రులయొక్క విరాజత్సేన రూపుమాసిపోవును. అది కూడదు అని తొలగినాడు. అది ఎట్లున్న దనగా పాండవులందలి దయచేత సూర్యుడు తన వెలుగుల నుపసంహరించుకొని అస్తంగతుడైన ట్లున్నది. సూర్యాస్తమయమైన దనగా యుద్ధము ముగిసినట్లు. ఆతరువాతకూడ ఎనిమిది దినములు యుద్ధము జరిగినది. అయినను అది పాండవుల కంత భారము కాదు. భీష్మునితీవ్రతవంటి తీవ్రత తరువాతి కౌరవసేనావీరులలో లేదు. భీష్మునకు పాండవులయం దున్నంత కృప మరి యేకౌరవపక్షమునందలి ఇతర వీరున కును లేదు.

పాండవులయందు జాలిగొని సూర్యు డస్తమించుట ఆ పదునెనిమిది దినములయుద్ధములోను ఒక్క ఈ తొమ్మిదవనాడే చెప్పబడినది. భారతయుద్ధ మున భీష్ముడు ప్రదర్శించిన తీవ్రతను, పాండవులం దున్న వానిదయ మున్నగు వాటిని క్రమముగా సూర్యునియం దున్నట్లు అస్తమించుటయందు రూపించుచు

రెండు పద్యములు వ్రాసి తిక్కన్నగారు కావ్యగౌరవమును ప్రకరణౌచిత్యమును గల వర్ణనము నిమిడ్చి సాధించినారు. వర్ణనములయం దౌచిత్యమునా నిట్లుండ వలెను.

## శిఖండి

విచిత్రవీర్యుని కొరకని భీష్ముడు కాశీరాజుకూతుంద్రను మువ్వురను అంబ – అంబిక – అంబాలిక అనువారిని బలిమిమై గొనివచ్చెను. అంబ అంతకు ముందటినుండియు సాళ్వు డనువానిని ప్రేమించుచున్నది. ఆమాట ఆమె భీష్ము నకు చెప్పగా అందుకు సమ్మతించి ఆయన ఆమెను సాళ్వునివద్దకు పంపినాడు. ఇతరులకొరకు వరియింపబడి గొనిపోబడినందున అంబను సాళ్వు డంగీకరింప లేదు. ఒకరి నామె కా దన్నది. ఆమెకోరినవా డామెను కాదనినాడు. ఆమె రెంటికిం జెడినది.

అంబకు భీష్మునిమీద కోపము వచ్చినది. వానిఅంతు చూడవలయు నను కొన్నది. ఘోరముగా తపస్సు చేసినది. ఆమెకు రుద్రుడు ప్రత్యక్షమై ఆమె కోరిన వరము నిచ్చెను. ఆ కోరిక సిద్ధించుట కామె ద్రుపదమహారాజుకు కూతురై పుట్టెను. వరముప్రకార మా తరువాత పురుషుడుగా మారును. ఎట్లును పురు షుడుగా మారుట కలదు గనుక చిన్నతనమునుండి ద్రుపదు డా పిల్లను పిల్లవా డట్లు పెంచెను. అందరును పురుషు డనియే అనుకొనుచున్నారు. ద్రుపదుడు తొందరపడి దశార్ణదేశాధీశుని కుమార్తెను తెచ్చి తనకొడుకునకు వివాహము చేసెను. ద్రుపదమహారాజు కొడుకు పురుషుడు కాదనియు స్త్రీ అనియు పెండ్లి కూతురు కనిపెట్టినది. ఆమె తనతండ్రి కావిషయ మెరింగించినది. ద్రుపదుడు తనను మోసముచేసినా డని మండిపడి యుద్ధమునకు సిద్ధమై వచ్చెను. పాపము ద్రుపదునికొడుకువేషముకూతున కిది అంతయు అవమాన మనిపించి ఆమె అడ వులుపట్టిపోయినది. అచ్చట ఆమె కొక యక్షుడు కనిపించి ఆమెయందు జాలికల వాడై కొంతకాలమునకు తనపుంస్త్వమును ఆమె కిచ్చి ఆమె స్త్రీత్వము తాను స్వీక రించెను. ఆవిధముగా ఆమె తనస్త్రీత్వమును విడిచి పురుషుడైనది. స్త్రీగా ఉన్నప్పు డామెపేరు శిఖండిని. పురుషుడుగా మారగానే పేరును మారి శిఖండి యైనది. **శిఖండి** యనగా భీష్ముని వధించుటకుగాను ద్రుపదునకు కూతురుగా బుట్టి కొడుకైన

అంబ యన్నమాట. అట్లు పురుషుడుగా ఉండుటకు కొంతకాలమే శిఖండికి వీలున్నది. ఆ గంధర్వునకు శిఖండినికిని జరిగిన ఒప్పందములో ఆ కాలనియమమున్నది. కాని శిఖండి ఎప్పటికి పురుషుడుగానే ఉండిపోయెను. ఎట్లనగా—శిఖండినిస్త్రీత్వము తీసికొన్న యక్షుడు తిరిగి నగరమునకు పోలేదు. ఆ వనమునందే యుండెను. కుబేరుడు వానిని వెదకుకొనుచు ఆవనమునకు వచ్చెను. కుబేరుడు తనను పిలిపించునంతకు వాడు స్వామిని చూడబోలేదు. కుబేరునకు కోపము వచ్చి ఈ స్త్రీవేషముతో నిట్లే ఎల్లకాలము నుండు మని శపించెను. అందువలన యక్షుడు పురుష డగుటకు లేదు. కావున శిఖండి స్త్రీ యగుట లేదు. ఆ విధముగా శిఖండి పురుషుడై నాడు. శిఖండి మరణించినతరువాతగాని యక్షుడు పురుషుడు కాడు. శిఖండి ద్రోణాచార్యునివద్దనే ధనుర్విద్యలు నేర్చెను శిఖండితో భీష్ముడు యుద్ధము చేయడు. అది యొక ప్రతిజ్ఞ.

## భీష్మవధ

యుద్ధ మింకను మొదలు కాలేదు. కాబోవుచున్నది. ధర్మరాజు పాదచారియై భీష్మునివద్దకు పోయి అతని కిట్లనెను.

'అనఘ నీ కెదిర్చి యని సేయువాఁడ నై
ము న్ననుజ్ఞ గొనఁగ నిన్ను గాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన
వడసి చనిన నేను పగఱ గెలుతు.' (1-156)

'అన విని గాంగేయుఁ డక్కట నీ విట్లు
నసుదేక తక్కిన శాప మిత్తు
వచ్చితి మే లయ్యె వైరుల నిర్జింపు
మిడఁగాకయును వర మెద్దియైన
నడుగుము నీకుగా నని సేయు టొక్కటి
దక్కంగ నావుడు ధర్మసుతుఁడు
రారాజుపక్ష మై రణము సేయుము నాకు
హిత మగు కార్యంబు మతిఁ దలంపు

మనుడు నట్లకాక యట నీతలం పేమి
యనిన భీష్ము తోడ నతఁడు నిన్ను
పోర గెలుచువిధము బోధింపు మనుటయు
నస్మితాస్యుఁ డగుచు శాంతనవుఁడు.' (1.157)

భీష్మవధావిధానమున కివి రెండు పద్యములును బీజభూతములు. ధర్మరాజు యుద్ధము చేయుటకు భీష్ముని అనుజ్ఞ కావలయునా? అది దీవనవంటి దనియు ధర్మరా జనుచున్నాడు. అందువలన ధర్మరాజు శత్రువులను జయించును. ధర్మ రాజు శత్రువులను జయించునట్లుగా భీష్మ డాశీర్వదింపవలయును. అదే యుద్ధముచేయుట కనుమతి.

ధర్మరాజు సమరకౌతుకి. ఆయనకు జయము కావలయును. భీష్ముడు కౌరవపక్షమున సేనానాయకుడై యుండియు ధర్మరాజు జయించుటను కోరు చున్నాడు. యుద్ధమునకు ముం దొకసారి ధర్మరాజు వచ్చి తనతో మాట్లాడి పోవలయు నని భీష్ముడు మనస్సులో గాఢముగా నసుకొనినాడు. భీష్మ డను కొన్నట్లే ధర్మరాజు పోయినాడు. భీష్మునకు చాల నంతోషమైనది. శత్రువు లను జయించునట్లు యుద్ధముచేయుట కనుజ్ఞ యిచ్చినాడు. "వైరుల నిర్జింపుము" —ఎవరు వైరులు? తా నెవరికి సేనానాయకత్వము వహించినాడో వారే శత్రువులు. తనను జయించినచో పాండవులు శత్రువులను జయించినట్లే. పాండవులు శత్రువులను జయింపవచ్చును. పాండవులు తనను జయింప వచ్చును. తాను వారిని జయించుమాటయే లేదు ఈ పునాదిమీద భీష్మపర్వము నడచినది. పదిదినములయుద్ధము కొనసాగినది. ధర్మరాజు భీష్ముడు రారాజు పక్షమే యుండవలయును. అటుండి ఇటు తన కాయన హితమును చేయవల యును. శల్యునివిషయమునకూడ ధర్మరా జిట్లే కోరినాడు.[18] శల్యునితో నీ విట్టిట్లు చేయమన్నట్లు ధర్మరాజు భీష్మునితో అనలేదు. అందుకే నీ ఆంతర్య మేమిటో చెప్పు మని భీష్మ డడిగినాడు. భీష్ముడు తనను యుద్ధమున గెలుచు నుపాయము బోధింపవలయును. అది ధర్మరాజు ఆంతర్యము. భీష్ముని ఎవరును జయించలేరు. ఆ విషయము ధర్మరాజుకు తెలియును. అందుకే ఇట్లు ప్రార్థించుట. నిన్ను యుద్ధములో గెలుచు ఉపాయము నీవు చెప్పకున్న మేము నిన్ను గెలువలే మనగానే భీష్మునకు చిన్ననవ్వు వచ్చినది. తన మహనీయ

18. ఉద్యోగపర్వము 1–109, 110

బలపరాక్రమ విషయము ధర్మరాజెరిగి మాటాడుచున్నాడు. అది తనకు సంతోషముగా నున్నది. ఆ సంతోషములో అనినాడు—'నను మార్కొని గెలువగ నయ్యనిమిషులకు నరిది'అని, 'అనుడు అట్లగుటగదా నిను వేడెదను-' (1-158) అని కుంతీతనయు డందుకొని పలికినాడు. కాని తనను పోర గెలుచు ఉపాయమప్పుడు భీష్ముడు ధర్మరాజుకు చెప్పలేదు. తరువాత రమ్మన్నాడు. ఆ ఉపాయము చెప్పుట కిప్పుడు తగినసమయము కాదు. అనగా తగినసమయము రానీ చెప్పెదనులె మ్మని యర్థము. భీష్ముడు తనను పాండవు లెట్లు యుద్ధమున జయించవలెనో దానిని బోధించుట కుద్యుక్తుడైనాడు. దేనికైనను తగిన సమయము రావలయును. తొందరపడిన పనులు గావు. ధర్మరాజు తొందరపడినట్లే భీష్ముడు భావించినాడు. అది నిజముకూడ. యుద్ధమే మొదలు కాలేదు. నిన్నెట్లు జయింపవలయునో చెప్పుము - అని అడుగుట తొందరపడియే కావలయును. కొన్నాళ్ల యుద్ధము చేసినమీదట ఎంతకును భీష్ముని జయించుటకు వీలుగానప్పుడు అప్పుడు పోయి తాతా అనినచో అది తొందరపడకపోవుట యగును. సమయము వచ్చినప్పు డడుగుట యగును. అట్లడుగు మని భీష్ముడు ధర్మరాజుకు సలహా యిచ్చినాడు. యుద్ధము మొదలైనది.

భీష్ముడు యుద్ధము చేసినట్లే లేదు. యుద్ధము మూడవనాడు తొమ్మిదవ నాడు భీష్ముని మహావీరవిహారమును సహింపలేక శ్రీకృష్ణుడు స్వయముగా చక్రము తీసికొని భీష్మసంహారమునకు కడంగినాడు. ఆనాడు భీష్ముడు భీషణాకారుడు. పాంచాలబలముల నానా డాయన చలిచీమలను కాలచమరినట్లుగా కూలగొట్టినాడు. ఎవరును ఏమియు చేయలేక పోయిరి. పాండవులు నివ్వెరపడి ప్రక్క కొదిగిరి. అప్పుడు సూర్యు డస్తమించి ఆనాటికి యుద్ధ మాగినది. కాబట్టి పాండవులు బ్రతికి బయటపడినారుగాని లేనిచో ఒక్కజీవుడును చేతికి వచ్చెడు వాడు కాడు. ఆనాడు ధర్మరాజే యుద్ధమును మాన్పించినాడు. గాంగేయునిచేత తాము భంగపడినట్లే పాండవులందరును తలచిరి. ఆనాడు దుర్యోధనాదులు భీష్ముని తెగ పొగడినారు. ధర్మరాజు తనబలము బెండువడిపోవుటను గమనించి నిశాసమయమున రహస్యముగా భీష్మునివద్దకు పోయినాడు. దుర్యోధనుని పక్షమున యుద్ధముచేయుచున్నను భీష్ముడు తనకు హితమైనదానిని చేయుటకు సంసిద్ధు డని ధర్మరాజుకు మంచినమ్మక మున్నదికదా! శ్రీకృష్ణుని, తమ్ములను తీసికొనిపోయినాడు. ఒక్కపనికిగాను ఇంత మంచి పోవుటచేత ఆవనియొక్క

అవసరము తెలియుచున్నది, మరియు నాపని చేసిపెట్టువాని కిందరు పోవుట ఎంతో గౌరవము. భీష్ముడు నిజవధోపాయ మిట్లు చెప్పినాడు. "ఇందరు వచ్చి యిట్టు లడుగ మీకు ప్రియమైన కార్యంబు మెయికొనంగ గనుటకంటెను సుకృతంబు గలదెః నాకు. ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందినను నన్ను జయింప సమకూరు...మరియు నొక్కవ్రతంబు పూనినవాడ. పుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చిన పురుషత్వంబు గలవానితోడ కయ్యంబు సేయంగాన మీకు నుపాయంబు సెప్పెద. ద్రుపదునపత్యం బైన శిఖండి యట్టి వా డగుట...విశేషించి ముందటి పుట్టువున అంగన యగుట వాని కెదురేయ కుండుదు. అర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి ఏ నేయుట మానిన యెడ నొప్పించి పడవైచునది. పదంపడి బంధుమిత్రు లగు ధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నాపనుపు. ఏను పనిచినట్లు చేయుండు." (3-302)

ఈ ఉపాయంబును భీష్ముడు సహృదయముగానే చెప్పినాడు. అనగా పాండవుల మనస్సులో నున్నదానికి అనుకూలముగా చెప్పినాడు. అనగా ఏమి చేసియైనను భీష్మునిబెడద వదలించుకొనవలసిన అవసరము పాండవులకు కల్గినది. భీష్మవధ పాండవుల పరాక్రమమువల్ల జరిగినది కాదు. భీష్ముని పాండవుల యందలి దయచేత జరిగినది.

యుద్ధము పదియవనాడు భీష్మునకు యుద్ధ మనగా విసుగు పుట్టినది. ధర్మరాజు నుద్దేశించి యి ట్లనినాడు. "ఆసురవిధి యైన యుద్ధములతోడనే జీవితము గడచిపోయినది. విసుగు పుట్టుచున్నది. మీరు నాహితమును కోరుదురు గాక. త్వరగా శిఖండిని ముందుబెట్టుకొని రండు. వచ్చి ఒక్కపెట్ట నాపై బడి యేయుడు. ఇక ఆలస్యము చేయవద్దు"- అని. పాండవుల విషయమున భీష్ముడు జాలిగొనుటను దేవత లగ్గించిపలికిరి. అట్టిచో "శిఖండిచాపము వెనుకం దన విల్లు నిల్పి వెస నాతం డేసిన భంగిగ నరుc డేసెను దొడ్డ నారసంబుల భీష్మున్." (3-402)

అర్జునుడు భీష్ముని పడద్రోసినాడు. ఉత్తరాయణము వచ్చువరకు ప్రాణములను శరీరమును విడిచిపోనీయక భీష్ము డుంచుకొనినాడు. అంతకాలము అంపశయ్యను పవళించినాడు. అర్జునుడే అమ్ములతో తగిన ఉపధానమునుగూడ చేసిపెట్టినాడు.

అట్లుండియుండి కాలము పక్వమైవచ్చిననాడు—"ధారణానుక్రమంబున సమాహితాత్ముం డయి వాయువుల నన్నిరుద్ధంబు జేసిన నవి యూర్ధ్వగతిం గైకొనియె నమ్మహాత్ముం డవయవంబులం బ్రాణంబులు వావికొనుచు వచ్చునయ్యెచోట్ల శల్యరహితంబు లగుచుండె నట్లగుటం గాంచి కృష్ణాదు లగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచు కీర్తించిరా సంయమచతురునిచే సర్వాయతన సన్నిరుద్ధం బై యాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబు కెగసి కొంతద వ్వరిగి యంత నంతర్హితం బయ్యె నప్పుడు పుష్పవృష్టి గురిసె."[19]

## భీష్ముడు

ఒక అభినివేశముతో మహాభారతయుద్ధము జరుగక తప్పనిపరిస్థితులు కల్పించిన ధృతరాష్ట్రుడును అతని నూర్గురు కుమారులును వారి మిత్రుడు కర్ణుడును - యుద్ధము చేయకతప్పక చేసిన పాండవులును భీష్మునితో రక్త సంబంధము కలవారు. అసలు కౌరవరాజ్యసింహాసనము భీష్మునిది. ఆహక్కును ఆయన స్వయముగా వదలుకొనెను. మరియు తనకు సంతానము లేకుండ ఆయన చేసికొనెను. మహాభారతపురుషులలో ఆయన ఉత్తాలతాలప్రమాణ కీర్తి తనూయష్టి.

భీష్ముని తల్లిదండ్రులు గంగాదేవియును శంతనుడును. శంతనున కింకొకభార్య కలదు. ఆమెపేరు సత్యవతి. ఆమె కిద్దరు కొడుకులు-చిత్రాంగదు డొకడు. విచిత్రవీర్యు డొకడు. సత్యవతిని శంతనునకు వివాహము చేయుటలోనే భీష్ముడు తాను వివాహ మాడ నని ప్రతిజ్ఞ చేసినది. భీష్మునకు విచిత్రవీర్యుడు సవతి తమ్ముడు. చిత్రాంగదుడు బాల్యముననే పోయినాడు. విచిత్రవీర్యునకు అంబిక-అంబాలికలతో భీష్ముడు వివాహము చేసినాడు. శంతనునితో వివాహము కాక మునుపు సత్యవతికి పరాశరమునీంద్రునివలన వేదవ్యాసుడు పుట్టినాడు. ఆ విధముగా భీష్మునకు వేదవ్యాసు డన్నగారు గాని తమ్ముడుగాని యగును. వేదవ్యాసుడు - భీష్ముడు - విచిత్రవీర్యుడు - ఈ ముగ్గురును అన్నదమ్ముల వరుసవారు. వేదవ్యాస విచిత్రవీర్యు లేకగర్భజనితులు. తండ్రి ఒక డగుట చేత భీష్మున కాయిద్దరును అన్నదమ్ములవరుసలోనివా రైరి. విచిత్రవీర్యుడు సంతానము లేకుండ మరణించినాడు. భీష్ముడు వివాహ మాడుటకు వీలులేదు గనుక విచిత్రవీర్యుని భార్యలయందు వేదవ్యాసునివలన సత్యవతి నియమించుట

19. అనుశాసనికపర్వము 5—468

చేత దేవరన్యాయమున జేసి వరుసగా ధృతరాష్ట్ర పాండురాజులు పుట్టిరి. ధార్త రాష్ట్రులు నూర్గురు కౌరవులు. పాండవులైదుగురు పాండవులు. కౌరవ పాండవులమధ్య జరిగినది భారతయుద్ధము.

భీష్మునకు వివాహమాడుట యున్నచో రాజ్యమున కాయనయే వారసుడు. సత్యవతిసంతానమునకు రాజ్యము రావలయుట కొరకే భీష్ముడు వివాహమాడుట లేకుండచేయబడినది. ఆ విధముగా కౌరవపాండవులకు భీష్ముడు తాతగారు. శ్రీ మహాభారతమున భీష్మునిచరిత్ర యిట్టిది. భీష్ముడుగా పుట్టక మునుపుకూడ భీష్మునకు చరిత్ర యున్నది. అప్పు డాయన ఎనిమిదిమంది వసువులలో ఎనిమిదవవాడు. అతనిపేరు ప్రభాసుడు. ఈ ఎనిమిదిమందియు తమ తమ భార్యలతో విహారముపోయి వసిష్ఠుని హోమధేనువును దొంగచాటుగా పట్టుకొనిపోయిరి. ఆవిషయమున ప్రధానుడుగా పనిచేసినది ప్రభాసుడు. తన భార్య ప్రేరణమువల్ల ఆయన అట్లు చేసెను. అందునిమిత్తమై వచ్చిన వసిష్ఠుని శాపమువల్లనే ప్రభాసుడు భీష్ముడై పుట్టి మర్త్యలోకమున పెద్దకాల ముండి అనపత్యుడై, భారతయుద్ధమును ప్రారంభము చేసి పదిదినములు నిర్వహించి అంపశయనమున పండి తనయిష్టము వచ్చినప్పుడు చనిపోయినాడు.

భీష్ముడు తల్లివద్దనే పెరిగినాడు. వానికి విద్యాబుద్ధులు నామెయే తీర్చిదిద్దినది. భీష్మునకు గురువు వసిష్ఠుడు. పూర్వజన్మకథ అది వేరు. భీష్ముడు వేదవేదాంగములు చదివినాడు. సకలశాస్త్రములు చదివినాడు. శుక్రబృహస్పతుల కేమాత్రము తీసిపోనట్లుగా చదివినాడు. అస్త్రవిద్యను పరశురాముని యంతటివాడై నాడు. ఆత్మజ్ఞానరూప మైన బ్రహ్మవిద్యయందు సనత్కుమారాదుల యట్టివాడుగా నయ్యెను. ఈ విధముగా భీష్ముడు సర్వజ్ఞుడు.

భీష్ముడు గొప్ప పితృభక్తుడు. తండ్రియభీష్టము నెరిగి, దాశరాజు కడకు పోయి వానికోరిక తీర్చుటకు రాజ్యపరిత్యాగమును, ఆజన్మబ్రహ్మచర్య వ్రతపరిగ్రహమును చేసి సత్యవతిని తెచ్చి తనతండ్రికి వివాహము చేసెను. ఇంత పనిచేసినందుకని దేవతలు వానిని భీష్ముడు అని పొగడిరి. అంతకుముందాతనిపేరు గాంగేయుడు. అ తరువాతనుండియే భీష్ముడు. భీష్ముడు చేసిన ప్రతిజ్ఞ దేవతల కంతగా భయావహ మైనది. రాజ్యమును త్యజించుటచేత లోభమును, బ్రహ్మచర్యవ్రతము నంగీకరించుటచేత కామమును ఏకకాలమున

జయించినవానిని చూచి దేవత లంతగా భయపడుదురు. భీష్మునిచేసిన త్యాగము దేవతల కెంత భీతావహ మైనదో, శంతనున కంతకుమించి సంతోషావహ మైనది. అందుకనే కుమారునకు స్వచ్ఛందమరణముగా వర మిచ్చినాడు.

విచిత్రవీర్యునకు కాశీరాజుకూతులను స్వయంవరమున జయించు కొని వచ్చి వివాహము చేసినాడు భీష్ముడు. విచిత్రవీర్యుని మరణానంత రము సత్యవతి భీష్ముని వివాహమాడు మని బలవంతపెట్టినది. కాని భీష్ముడు లొంగలేదు.

పాండురాజు మరణానంతరము అడవులనుండి తిరిగి వచ్చిన పాండు కుమారులను ధృతరాష్ట్రు డాదరించుటకు ప్రోద్బలముగా నుండి కురుపాండవు లకు ద్రోణాచార్యులవద్ద విద్య చెప్పించినది భీష్ముడు. ఆయన ఎప్పుడును ధర్మ పక్షము నవలంబించి మాటాడును. పాండవులు ధర్మాత్ములు. పాండవులు ద్రౌపదిని వివాహమాడినతరువాత దురాలోచనలు చేయుచున్న తండ్రికొడుకులకు ధృతరాష్ట్ర దుర్యోధనుల కుచితమును భీష్మ డుపదేశించినాడు. వారు విన లేదు. ధర్మరాజు రాజసూయయజ్ఞము నొనరించెను. యజ్ఞపురుషునిగా శ్రీకృష్ణుని పూజింపు మని భీష్ముడు ధర్మరాజుకు బోధించెను. శిశుపాలు డా మాటను కాదని ఎదురుతిరిగియే శ్రీకృష్ణునిచేత హతుడైనది.—ఇంతవరకు ఇది ఆది సభాపర్వములలో నున్న భీష్మునిచారిత్రక రేఖాచిత్రము. ఆరణ్య పర్వము భీష్మునికథను చెప్పదు. విరాటోద్యోగములలో తిరిగి భీష్మ డున్నాడు. ఉత్తరగోగ్రహణసందర్భమున పాండవుల అజ్ఞాతవాససమయకాల విషయమును నిరూపించి ఉన్నరూ పేర్పరచినది భీష్ముడు. ఉద్యోగపర్వమున సంజయుడు రాయబారము పోయి వచ్చినతరువాత కర్ణుని దుర్నయములను ధృతరాష్ట్రుని దృష్టికి భీష్ముడు తెచ్చి వానిని మందలింపవలసినదిగా కోరినాడు. ధృతరాష్ట్రు డొకరిమాట వినడు గనుక భీష్మునిమాటయు వినలేదు. కృష్ణరాయబారమున దుర్యోధనునకుగూడ భీష్ముడు హిత ముపదేశించినాడు. కాని అతడును వినలేదు. తనమాటను వారు విన లేదని వారిపక్షమును భీష్ముడు వదలి పాండవులను చేర లేదు. కౌరవసైన్యమును యుద్ధమునకు నడిపించిన సేనానాయకుడు భీష్ముడు ఎవరిబల మెంతయో ఆయనకు తెలియును. అయన పెద్దరిక మాయన కుంచియే దుర్యోధనుడును ప్రవర్తించినాడు. తనను అర్ధరథు డని నిర్ణయించినందుకు నిరసనగా కర్ణుడు భీష్ముడు మరణించినదాక తాను యుద్ధమునకు రానని నాడు!

కర్ణుడు రాకపోవుటకైనను దుర్యోధను డంగీకరించి భీష్మునే తన సర్వసేనా ధ్యక్షుడుగా ఎన్నుకొనినాడు దుర్యోధనుని కోరికమేరకు భీష్ముడు పదిరోజుల పాటు మహాభారతయుద్ధమును నడిపించినాడు

మహాభారతయుద్ధ మైపోయినతరువాత శోకమోహగ్రస్తు డైన ధర్మరాజును ప్రశాంతచిత్తు డగునట్లు ప్రబోధించినది భీష్ముడు. ధర్మరాజు సర్వసంశయములను విచ్ఛేదము చేసి జ్ఞానసుస్థిరతను భీష్ముడు కల్పించినాడు. గంగాదేవి చిన్నప్పుడు సనత్కుమారాదులయంతటివాడుగా బ్రహ్మవిద్యాసంస్కారము కలిగించినదిగదా! భీష్ముని ఆత్మవిజ్ఞానమే శాంతి ఆనుశాసనిక పర్వముల యందు పరచు కొనియున్నది. భీష్ముడు ధర్మరాజు రాజ్యతంత్రమునందు చక్కగా ప్రవృత్తుడగుటకు కావలసిన ధర్మోపదేశము శాంత్యానుశాసనిక పర్వముల యందు చేసెను. అర్జునునకు శ్రీకృష్ణుడు భగవద్గీత నుపదేశించుటవంటిదే ధర్మరాజునకు భీష్ముని ధర్మోపదేశము.

ఉత్తరాయణము వచ్చినవెంటనే భీష్ముడు శ్రీకృష్ణుని అనుజ్ఞతీసికొని శరీరత్యాగము చేసి ప్రాణోత్క్రమణము చేసికొనిపోయి వసువులలో కలిసినాడు.

ఇంతటి పూర్ణపురుషుడు భీష్ముడు చిట్టచివరకు శ్రీకృష్ణునితో ఒక మాట అనినాడు. ఆయన ప్రవృత్తినిబట్టి ఆమాట ఆయన నోటివెంట వచ్చు నని ఎవరును ఊహించలేదు. కాని హఠాత్తుగా వెలికి వచ్చినది.

'బలము నీవ నాకు భక్తుఁడ నీయెడ
ఆలు బిడ్డ లేనియట్టివాడ
కావు నన్ను నధికకారుణ్యమున ని మ్మ
నుజ్ఞ కమలదళమనోజ్ఞనయన!" (అనుశా. 5-463)

ఆలుబిడ్డలు లేనియట్టివాడను స్వామీ అనుచున్నాడు. అందు కా జీవు డెంత వేదన పడినాడో? ఆ మూగవేదన ఆయన జీవితకాలములో ఎప్పుడునుగాని పొరపాటునైనను వెలికి రాలేదు. అంతజాగ్రత్తగా బ్రతుకు వెళ్ళదీసికొన్న భీష్ముడు చివరిక్షణములో భగవంతునిముందు తనచిత్తమున అట్టడుగుపొరక్రింద పడియున్న అనుభవైకవేద్య మైన జీవసంస్కారలక్షణమును తీసి పెట్టినాడు,

భార్యాపిల్లలు లేని జీవితముయొక్క దుర్భరత్వమును భీష్ముడు ఉచ్ఛ్వసించు చున్నాడు. జీవితము పరిపూర్ణ మగుటకు ఆలుబిడ్డలు కావలయునా? కావలయును కావలయును. భీష్మునికంటె ఆత్మజ్ఞాని యెవ్వడు?

ఒకవిధముగా శ్రీకృష్ణుని తరువాత మహాభారతములో భీష్మునే చెప్పవలయును. శ్రీకృష్ణుడు భగవంతుడు. భీష్ముడు భక్తుడు. శ్రీకృష్ణుని భగవత్తత్త్వమును లెస్సగా ఎరిగిన భక్తుడు. లోకహితార్థము బ్రతికిన మనిషి ఆయన. దుర్యోధనునిపక్షము వహించి పాండవులతో యుద్ధము చేయుటలో ఆయన తనఏలిక ఆజ్ఞప్తిని ధర్మజునికంటె మిన్నగా భావించెను. భావించలేదు. ఆజ్ఞప్తిని మన్నించి ప్రవర్తించుటనే ఎన్నుకొనెను. ధర్మపక్ష మెట్లును జయించు నన్న విశ్వాస మతని నట్లుగా ప్రవర్తింపజేసియుండును. శాంత్యానుశాసనిక పర్వములలో ధర్మరాజు కాయన చేసిన ప్రబోధము అదియొక విజ్ఞాన సర్వస్వము. వ్యక్తి నడవడికలు - సాంఘిక నైతికవిలువలు - రాజకీయ ఆర్థిక సూత్రములు - మత తాత్త్వికశాస్త్రములు- ఈ మొదలైన విజ్ఞానమునంతటిని ఆయన ఆ రెండుపర్వములలో ధర్మరాజునకు బోధించునెపమున సంపూర్ణ ముగా ప్రకటించెను. భీష్ముడు లోభకామములను త్యజించినవాడు. పరశు రాముని కీడైన పరాక్రమముకలవాడు. ప్రతిజ్ఞలను నిలబెట్టుకొనగలిగిన స్థిత ప్రజ్ఞుడు. ఆయన ఎంతటి యుద్ధవీరుడో అంతటి రాజకీయవేత్త. ఎంతటి రాజ కీయవేత్తయో అంతటి మహర్షి. ఎంతటి మహర్షియో అంతటి మనీషి. ఆయన శాంతశూరుడు.

ఇది భీష్మపర్వమునకు ఉపోద్ఘాతము. దీని కిట్లు అవకాశమును కల్పించి యిచ్చిన ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారికి కృతజ్ఞుడను.

హనుమకొండ,
1–11–1971.

కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము

శ్రీ సంపాదిపదాంబుజ
నాసాగ్రనివాసరసిక నాదామృతధా
రాసారరూప వేద
వ్యాసవ్యంజితవిహార హరిహరనాథా. 1

ధృతరాష్ట్రునికడకు వేదవ్యాసుండు వచ్చుట
సం, 6-2-1

క. దేవా! జనమేజయవసు
ధావల్లభుఁ డధికవినయతత్పరుఁ డై సం
భావించి కుతూహలమునఁ
దా వైశంపాయనునకుఁ దగ నిట్లనియెన్. 2

క. ఒండొరుల గెలుచు తలఁపునఁ
బాండవులును గౌరవులును బాహాగర్వో
ద్దండత నెట్లు దొడంగిరి
ఖండన మెప్పాటఁ జెల్లెఁ బరమమునీంద్రా. 3

క. అనుటయు వైశంపాయనుఁ
డనుమోదరసార్ద్రహృదయుఁ డై యిట్లనియెన్
జనమేజయుమనమున సం
జనితం బగు కౌతుకంబు సఫలతఁ బొందన్. 4

వ. పుణ్యక్షేత్రోత్తమం బయిన యాకురుక్షేత్రంబున నారెండుదెఱంగుల
వారికటకంబులును విడిసి కయ్యంబునకు గాలుద్రవ్వునట్టి సమ్మయంబున

ధృతరాష్ట్రుండు గొడుకుల దుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది
సంజయద్వితీయుం డై చింతించుచున్న యెడకుం ద్రికాలవేది యగు
వేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి సేయు నర్చనంబులం
గైకొని యతని కిట్లనియె. 5

క. కాలం బగుటయు నృపులకు
నాలము సమకూరె దీని కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన
నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా. 6

చ. అనుఁడు నతండు ఘోరముగ నన్నలుఁ దమ్ములుఁ బోరు క్రూరతం
గనుఁగొనఁ జాల నేను వినఁగా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్స యన్న ముని చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరిపాటి మెయిన్ సకలంబుఁ జెప్పఁగన్. 7

వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యా
సూతనందనునకు నా రెండు దెఱంగుల వారి దివారాత్ర ప్రవర్తనంబులు
గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు
లెఱుంగునట్లునుంగా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారత
సమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండునట్టి
ప్రభావంబుఁ బ్రసాదించి దివ్యుల యాలాపంబులు రూపంబులుం దలం
పులుం దేటపడునట్టి మహనీయబోధంబును గలుగ ననుగ్రహించి
యావైచిత్రవీర్యు నాలోకించి యిది ప్రాప్తకాలం బై వచ్చిన భూ
ప్రజాక్షయంబు దీనికి వగవం బని లేదు ధర్మోజయ మనుచు నిశ్చింతం
బున నుండు మేనును గురుపాండవుల కీర్తిఁ బ్రకటింపగలవాఁడ నని
యతని నాశ్వాసించి సాత్యవతేయుండు వెండియు. 8

క. మొగుళులు లేకయు నుఱుములు
గగనక్షోభంబు సేసెఁ గరిహయతతిఁ బె
ల్లుగ నశ్రు లురులఁ జొచ్చెను
మృగములు పక్షులను బసులు మృగముల నీనెన్. 9

క. నలువురు నేవురుబిడ్డలు
గలిగెద రొక్కొక్కవనితగర్భంబున వా
రలు పుట్టినపుడ యాడుచుఁ
గలకల నవ్వుచుఁ జెలంగఁ గనియెద మెందున్. 10

తే. అర్కు నుదయాస్తమయములయందుఁ గృష్ణ
కాంతి ఘోరకబంధంబు గప్పఁ జొచ్చె
నిందులాంఛనస్థితి తలక్రిందు గాఁగఁ
దోఁచుచున్నది ప్రజ యెల్లఁ ద్రుంగ కున్నె. 11

వ. విశేషించియుం గౌరవనికేతనంబులఁ గేతనంబులఁ బొగ లెగయుటయు
నాయుధంబులు మండుటయు నివి మొదలుగా ననేకదుర్నిమిత్తంబులు
పుట్టుచున్నయవి కులక్షయంబును నానానరేంద్రనాశంబును నగు నుపే
క్షింపం దగదు దుష్పథవర్తు లగు దుర్యోధనాదికుమారుల వారించి
నీతమ్మునిపా లతనికొడుకుల కొసంగి శాంతిసేయుట మేలు మము
బోంట్ల మనంబులకుం బ్రియంబుగాని యీరాజ్యంబు నీకేటి కనిన విని
యమ్మనుజేంద్రుం డమ్మునీంద్రున కిట్లనియె. 12

చ. హితమును ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్న నా
సుతుల నయంబుమై దఱిమి చూచితి వారలఁ బంపుసేయ నేఁ
జతురుఁడఁ గాను బ్రాభవము సాలదు నా దెసఁ దప్పు లేమి మీ
మతిఁ దలపోసి యీపలుకు మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్. 13

వ. అనిన విని పరాశరసూనుం డది యట్లుండని మ్మింక నేమేనియుం
జెప్పవలయునది గలదే యని పలికిన నాంబికేయుండు గయ్యంబున
గెలుపు దెలుపు నిమిత్తంబు లడిగిన నమ్మునివరేణ్యుండు వహ్నులు
హోమకాలంబునం బుణ్యగంధంబులతోఁ బ్రదక్షిణార్చు లగుటయు
భేరీప్రముఖంబులు గంభీరఘోషంబు లగుటయు వాయువు లనుకూల
మృదు మనోహర ప్రచారంబు లగుటయు నివి మొదలుగాఁ గొన్ని
శుభసూచకంబులు నిర్దేశించి కొంచెంబు పెద్ద యన లేదు సమరంబున
జయంబు దైవాధీనంబు గావునం బెద్దలు పెనఁకువ లొప్ప వని

చెప్పుదు రేను బోయివచ్చెద నని చెప్పి సముచితప్రకారంబున నంత ర్ధానంబు సేసెఁ దదనంతరంబ యక్కౌరవేంద్రుండు గొండొకసేపు చింతించి నిట్టూర్పు నిగుడించి సంజయున కిట్లనియె. 14

ఉ. భూమికిఁ గాఁగఁ బ్రాణములపోక దలంపక రౌద్రఘోర సం
గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంత దీపాకో
భూమి మునీంద్రసంగతి సుబుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధనిరూఢముగా సమస్తమున్. 15

వ. అనిన విని సంజయుం డతని కిట్లను నాయెఱింగినంతయు నెఱింగిం చెద భూతత్త్వప్రకారం బవధరింపుము. 16

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట

సం. 6-5-9

తే. అధిప నానాప్రకారచరాచరంబు
లింద వేర్వేఱ జనియించు నింద పెరుఁగుఁ
బిదప నింద యడంగు నీపృథ్వి దాన
సకలమునకుఁ బరాయణస్థాన మరయ. 17

వ. అదియునుంగాక వినుమాకాశంబునకు గుణంబు శబ్దంబు వాయువు నకు శబ్దస్పర్శంబులును దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును నప్పులకు శబ్దస్పర్శరూపరసంబులును గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరస గంధాత్మకం బైన గుణసముదయం బంతయుం గలదు గావున నిమ్మహాభూతంబు లేనింటిలోనం బృథివి యెక్కుడు దీనియున్న విధంబు వివరించెద నాకర్ణింపుము. 18

సీ. ధాత్రీశ మేరువు దక్షిణంబున సుద
ర్శన మను నభిధానమునఁ బ్రభూత
విస్తారమై రెండువేలు నేనూఱు యో
జనముల పొడువు నై సరసమధుర

విపులశాశ్వతఫలవితతిసమేత మై
యెక్క జంబూతరు వొప్పియుండు
దానిపండులు మహీస్థలి మహారవముగ
ననిశంబుఁ బడి రాలి యవియుచుండు

ఆ. వానిరసము పొంగి వాహినీమూర్తి న
న్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ
నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము
లందుఁ జొచ్చి పాఱు నంబునిధికి. 19

వ. జంబూనది యనం జరగిన యాతరంగిణినీరు సోఁకినచో నెల్లను సువర్ణం బగుటం జేసి కనకంబునకు జాంబూనదం బను నామంబునుం గలిగెఁ దదీయ జలపానంబు సేసిన మానవులకు ముదిమియుం దెవులును దప్పియు లేవని చెప్పుదు రయ్యేటి బడమటం బెరిఁగి పఱపు గలిగి శరనిధిచందంబున జంబూషండంబు గాఱుకొనుచుండు నింతటికిం గారణం బయిన యాజంబూవృక్షంబు పేర నీద్వీపంబు జంబూద్వీపం బును సుదర్శనద్వీపంబు నన నెగడి లవణసముద్రముద్రితం బయి పొలుచు నద్దీవియందు. 20

సీ. నిడుపునఁ దూర్పును బడమర నై రెండు
గడలు నంభోనిధి గదిసియుండు
రత్నమయంబులు రమణీయములు సాధ్య
సిద్ధచారణగణ సేవితములు
నై హిమాచలమును నావల హేమకూ
టంబును నట నిషధంబు నొప్పు
లలితంబు లై ననీల శ్వేతశృంగవం
తంబులు గ్రమమునఁ దనరి పొలుచు

ఆ. నివుల మూఁటి కవల నవుల యమ్మూఁటికి
నివలఁ దేజరిల్లు దివిజనగము
గమలకర్ణికాను కారి యై కాంచన
మణిమయత్వమహిమమహిత మగుచు. 21

తే. అతిదృఢం బగు పాఁతు పదాఱువేల
యోజనము లంద్రు దానికి రాజముఖ్య
యెందు మెనుబదినాలుగు వేలయోజ
నంబు లని హేమధాత్రీధరంబుపొడువు. 22

వ. ఇవ్విధంబున భూమధ్యంబున నున్న యమ్మేరుమహీధరంబున దేవత
లును దేవమునులును గంధర్వకింపురుషాది దేవయోనులును దేవేంద్ర
ప్రముఖ దిక్పతులును బరమేష్ఠియుం దత్తత్ప్రదేశంబులఁ బుణ్యావర్త
నంబులం బరమసుఖంబు లనుభవింతు రుత్తరతటంబునం గర్ణికార
వనంబున గౌరీసమేతుండై సిద్ధగణంబులు పరివేష్టింప విశ్వేశ్వరుండు
విహరించుచుండు. 23

క. తొమ్మిదిఖండము లై వ
ర్షమ్ము లనం జాల నొప్పుచుఁగు జంబూద్వీ
పమ్మున జనపదములు విను
మమ్మహితాంశములు దెలియ ననువర్ణింతున్. 24

వ. ఉత్తరసముద్రంబు శృంగవంతంబు మధ్యమం బైరావతవర్షం బన
నొప్పు శ్వేతపర్వతశృంగవంతంబుల నడుము హైరణ్మయవర్షం బనం
బొలుచు నీలశైలోత్తర దక్షిణదేశంబులు గ్రమంబున రమణకవర్షం
బును నీలావృతవర్షంబును ననం జెలు వమరు మేరువునకుం బ్రాచ్య
ప్రతీచ్యంబు లగు భాగంబులు వరుసన భద్రాశ్వవర్షంబును గేతుమాల
వర్షంబును ననం బొగడొందు హేమకూటోత్తరభూమి హరివర్షం బన
నెగడు హిమవంతంబు నక్కడయు నిక్కడయు నోలిన కింపురుషవర్షం
బును భారతవర్షంబును ననం బెంపారు ని ట్లున్న దీనియందు. 25

క. భారతవర్షముఁ దొడఁగి మ
హీరమణ యుదీచ్యము లను నెక్కుడు బలస
త్త్వారోగ్యాయుస్సుఖపు
ణ్యారంభ గుణంబు లంత కంతకు నరయన్. 26

వ. అనిన విని వైచిత్రవీర్యుండు సమస్తద్వీపంబులు సకలజలనిధులు నున్న పరిపాటియుం బ్రమాణంబులుం బ్రకాశంబుగ నెఱింగింపు మనుటయు సూతసూనుండు జంబూద్వీపవిష్కంభంబు కొలంది యెనుబదివేలు నాలుగు నూఱుయోజనంబులు దీని రెండంతలు దొడంగి లవణేక్షుసురాఘృతదధిక్షీరశుద్ధజలమయంబు లయిన మహార్ణవంబుల విష్కంభంబులు క్రమంబున నొకటి కొకటి రెట్టియై యుండుఁ బ్లక్షద్వీప శాల్మలదీప క్రౌంచద్వీప కుశద్వీప శాకద్వీప పుష్కరద్వీపంబుల విష్కంభంబులును జంబూద్వీప విష్కంభద్విగుణప్రమాణంబు మొదలుగా నోలి నొకటి కొకటి యినుమడియై యుండు నయ్యాఱుదీవులును జంబూద్వీపంబు కంటె నెల్లదానను బొగడ్తపడి యనేకపర్వతంబులను నానానదులను బహుజనపదంబులను నొప్పి వరుస నొండొంటికి గుణవిశేషంబుల నధికంబులై యుండు నింతకుం గర్తయు భర్తయు హర్తయు నై దుగ్ధాంబుధియుత్తరంబునం గనకమయంబై యష్టచక్రంబును బ్రభూతభూతయుక్తంబును మనోజవంబును నగు మహనీయశకటంబున వినోదపరాయణుండైన నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుండై విహరించుచుండు నని చెప్పుటయు నతండు. 27

క. భారతవర్షమునకుఁగాఁ
గౌరవులును బాండవులును గాంక్షం గడుఁ బె
ల్లై రాసి యొండొరులతో
బోరం దెగి రిట్టి లుబ్ధబుద్ధులు గలరే. 28

వ. అనిన విని యమ్మనుజపతికి సంజయుం డి ట్లనియె. 29

ఆ. అధిప పాండుసుతుల కరయంగ నతికాంక్ష
లేదు లుబ్ధబుద్ధి నీదు సుతుఁడు
శకునికలపు విని యసన్మార్గవృత్తికిఁ
జొచ్చి యిట్టియెడరు దెచ్చికొనియె. 30

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతవర్షంబునం గల విశేషంబులు సెప్పుట

సం. 6-10-1

క. తమతమదేశంబులకై
మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలున భూ
రమణులుఁ గొందఱు వచ్చిరి
సమగ్రసఖ్యమునఁ గూడుచందమునఁ దగన్. 31

తే. వారి నన నేల తొల్లియు వసుధకై య
నేకనృపతులు పోరాడి రిట్లు నేల
ప్రాలి కాదె భగీరథ రఘు యయాతి
నహుషముఖ్యులు విశ్రుతోన్నతులు గనిరి. 32

వ. భారతవర్షంబున నపారవిభూతివిలాసంబున కాసపడి యీసునం
బెనంగ కుండుదురె దీని విస్తారంబు విను వివరించెద. 33

ఆ. మలయ మనఁగ శుక్తిమంతంబు నా వింధ్య
మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర
మనఁగ ఋక్షవంత మన సహ్య మన నిందుఁ
గులనగంబు లేడు వొలుచు నధిప. 34

వ. వీనియందు వివిధమణిగణంబులు సమకూర్పవచ్చు ననిన ఖనివిశేషం
బులు సెప్పనేల మఱియు నుపమహీధరంబు లనేకంబులు గలిగియుండు
వానియందు, 35

క. ఇనుమును రాగియుఁ దగరం
బును వెండియుఁ బసిఁడియుం బ్రభూతము లై పే
ర్చిన సిరిఁ జేయగ నొప్పెడు
ఖను లెడనెడఁ బెక్కు గలవు కౌరవనాథా. 36

క. వెండియు ధనార్జనంబులు
గొండలవలనన ఘటించికొన నగు నేర్పున్
దండితనంబును బాడియు
నొండొంటికి మిగుల గలిగి యున్నట్లయినన్. 37

వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు వేదవతియుఁ గృష్ణవేణియుఁ బెన్నయు యమునయుఁ దమసయు శిరావతియు గావేరియు గోదావరియు నర్మదయు బాహుదయును సరయువును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు నను మహానదులు మఱియు ననేక సరిద్విశేషంబులునుం గలిగి వీనివలన నానాముఖంబులు ధనధాన్యాది సంపదాగమంబులు సొంపు మిగిలి యుండు. 38

క. ఎడనెడఁ బఱపై యొప్పెడి
యడవు లనేకములు వానియం దర్థము సే
రెడువెరవులు పెక్కులు నొ
ప్పెడి యుండు నయంబుతోడి బలిమి గలిగినన్. 39

వ. పాంచాల పాండ్య బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కుకురు కోంకణ ఛేంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్రక పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ మరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంత లావంతికానూపాది జనపదంబులు సమస్తవస్తుసంపత్సంపాదనంబు లయిన గుణవిశేషంబుల వెలసి పురుషార్థంబు లగు ధర్మార్థకామంబులకుం గారణంబులై కమనీయంబు లగుచుండు. 40

క. వినికి గలిగి రక్షించుచు
ననువున దయతోడిపాడి నాయతు లెల్లం
గొనుచు దగ నేలి పొగడొం
దిన రాజున కుర్వి గామధేనువు గాదే. 41

ఆ. వెరవు లావుఁ గలుగు నరనాథు లింతదే
శంబు గలదు తమకుఁ జాలు ననరు
దండ్రి బిడ్డ యన్నదమ్ముఁడు నా కెత్తి
పోయి పోటులాడి పుడమిఁ గొంద్రు. 42

క. కావునఁ గౌరవపాండవు
లీవసుధకు నై పెనఁగు టెగ్గే దైవం
బేవంక ప్రాలె వా రిక
పోవుం గా కిది నరేంద్ర పొంగులకు మింకన్. 43

వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో నీ వింక సంగరంబుఁ జూడం బొమ్మని సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారతరణ ప్రకారం బనుసంధించి యతండు కతిపయదినంబులకుం జనుదెంచి తగినతెఱంగునం గాంచి. 44

క. కొడుకులదెస నెవ్వగఁ జె
డ్పడి వందురి యున్న యానృపాలునడుగులం
బడి భీష్మపాటు సెప్పుచు
నడలి కరుణనాద మెసఁగ నాక్రందించెన్. 45

వ. అయ్యేడ్పుతో ని ట్లని విలాపంబు సేయు. 46

సీ. ఆత్మయోధుల కెల్ల నాధార మగునట్టి
తనకు నస్త్రంబు లాధార మయ్యెఁ
బరశురామునకు మే ల్సరియైన తనయందుఁ
గలిగె భంగంబు శిఖండిచేత
జనపతి దను నచ్చి మును జూద మొనరించెఁ
దాను గయ్యంపుజూదమున నోడెఁ
దనయార్పు లెలుఁగునఁ దఱఁకువైరులు వొంగ
నొఱలుచు నేలకు నొఱగె నేఁడు

ఆ. తీవ్రబాణజాలదీప్తులు పరగించి
పాండుతనయ సైన్యబహుళతమము
లీలఁ బదిదినంబు లోలి వినోదించి
యధిప భీష్మభానుఁ డస్తమించె. 47

క. పదివేవురు రాజులు దన
కెదిరి పొలిసి రా శిఖండి యేమిటివాఁ డై
తుదిఁబోయి తన్ను నాజిం
గదియుచుఁ బొలియించె నియతిఁ గడవగ వశమే. 48

తే. చాపవక్త్రుండు భల్లదంష్ట్రావితాన
ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ
జిహ్వికాభీషణుఁడు నరసింహమూర్తి
గాక కేవలనరుఁడె గంగాసుతుండు. 49

ధృతరాష్ట్రుఁడు భీష్మమరణంబు విని విలపించుట.

సం. 6—14—1

వ. అని సంజయుండు పలవించుపలుకుఁకుఁ జిత్తంబు జల్లని యుల్లంబోయి మూర్ఛిల్లి కొండొకసేపునకు శిశిరవిధానంబుల సేద దేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరంగ గద్గదకంఠుండై. 50

క. దేవాసురవరు లొక్కటి
యై వచ్చినఁ జిక్కువఱుచు నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండి శ
రావలిపా లయ్యె నేమి యనఁ గల దింకన్. 51

ఉ. అంచితతాలకేతుకిరణాళి మెఱుంగులు గాఁగ మౌర్వి మ్రో
యించుట గర్జచందముగ నేచి విరోధిదవానలంబు మా
యించు శితాస్త్రవర్షమున నిట్టిది భీష్మమహాభ్ర మెట్లకం
గించెనొకో శిఖండి యనుకృత్రిమవాయువు దాఁకి దైవమా. 52

తే. పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు
నిలువ నిమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి
యుండ నత్యంతతుచ్ఛశిఖండిపల్వ
లాక్రమంబున మునిగితే యకట తండ్రి. 53

ఉ. వీరరసాంబుపూరమును విశ్రుతబాహుమహోగ్రసత్త్వమున్
జారుగదాధ్వజాచలవిశాలము నంబకజాలవీచికా
స్ఫారము నైన భీష్ముఁ డను సాగరమున్ గడవంగ నీఁదఁగా
నేరిమి యెట్లొకో కలుగనేర్చె శిఖండికి నేమి సేయుదున్. 54

తే. అంబకై పూని వచ్చి బలాధికుండు
జామదగ్న్యుండు సాధింపఁ జాలకున్న
వాని భీష్ముఁ బాండవులకై పూనివచ్చి
కడిమి సాధించి తౌర శిఖండి పోర. 55

క. ఆ శౌర్యం బా సత్త్వం
బా శీలం బా పరాక్రమాభీలత్వం
బా శుద్ధవ్రత మేఁదు న
నాశము లని భీష్ముఁ బెద్ద నమ్మితిమి గదే. 56

వ. అని బహుప్రకారంబులం బలవించి యా సూతనందను చేసేతం
గీలించి. 57

సీ. అతఁడు నొచ్చినతఱి నడ్డంబు సొచ్చెద
మని వచ్చువారు లేరైరె యచట
నడిరి పోరాడక యన్ని యక్షౌహిణు
లొప్పరికించెనె యొకనిఁ గలన
నతని నోర్వఁగఁజాల వని నిశ్చయించితి
మంతకు నోపెనే యరిబలములు
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును
శల్యుండుఁ గ్రేడించి చనిరె యపుడు

తే. పాండుసుతులు శిఖండియుఁ జండశక్తి
మెఱయ నొక్కటఁ బైఁబడ్డ వెఱచి తాత
విడిచి నాపుత్త్రులందఱు విఱిగి యడవిఁ
గలిసిరొకొ యాతనికిఁ బడవలసె నకట. 58

వ. దేవవ్రతుఁడు దెగినయప్పుడ తక్కినయంతవట్టును దెగియెనకాఁ
దలంచెద నని మఱియు ని ట్లనియె 59

సీ. కురుగురు వృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ
జంపి రాజ్యము సేయ సమ్మతించి
తొడరిన పాండుపుత్రులకును దైవంబుఁ
దోడయ్యె ధర్మంబు గీడుపఱిచి
పరగి యధర్మంబు పెరిఁగిన ట్లున్నది
వార లాతనిఁ గూల్చి వసుధఁ గొనఁగ
నిశ్చయించుట గడు నిష్ఠురత్వము దాని
గంటెను బాపంబు గాదె మనకు

తే. సంగరంబున నాతండు సచ్చు టోర్చి
సంపదకుఁగాఁ బెనంగినచంద మరయఁ
గులము లందెల్ల నీ రాచకులము సాల
బెట్టిదం బిక్కలంబునఁ బుట్ట నగునె. 60

వ. అని పలుమాట లాడి వెండియు. 61

ఆ. మగఁడు లేని మగువమాడ్కి గాకున్నె నా
సేన భీష్ము లేమిఁజేసి నేఁడు
కురుకుమారు లెంత గుందిరో యెవ్వరే
మైరో యింక నెట్టు లగుదు రొక్కొ. 62

క. రాజులు మంత్రులు ననియెడు
నాజూదరు లాత్మ నేమి యని తలఁచిరొ యే
యోజం బలికి రొకో తమ
కాజికి నిట మీఁద నెవ్వ దాధారంబో. 63

వ. అని పలికి సంజయుకరంబు విడిచి కయ్యం బెయ్యెడం బొడిచిరి పదిదినం
బులు నుభయబలంబులవారును నెవ్విధంబున మోహరించి యెవ్వ రెవ్వ
రెప్పు డెప్పు డేమి సేసి రిన్నాళ్లుగా గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబు

సేసెఁ దుది నెత్తెఱంగునం దెగియె నంతయు వివరించి పరిపాటిం
దేటపడం జెప్పుము. 64

ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా
కట్టిఁడి వీను లేమి విను కాఱియ కోర్వవు దుర్వినీతికిం
బుట్టినయిల్లు నై వినక పోవఁగ వచ్చునె యింక నాకు నే
దిట్టఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా. 65

వ. అనిన విని సంజయుం డతని కిట్లనియె. 66

ఆ. అధిప నీవు సెప్పినట్టిద నీయవి
నీతిఁ జేసి ధర్మనిరతు లైన
పాండుసుతుల కన్ని పాటులు వాటిల్లె
నింత దెచ్చికొంటి వంత సేసి. 67

క. కీ డొనరించినవారికిఁ
గీ డగు టరుదయ్య మేలు గీ డేమియు నీ
వాడక విను నను గయ్యముఁ
జూడఁగఁ బుచ్చుట వినంగఁ జూచియ కా దే. 68

క. వేదవ్యాసమునీశ్వరు
పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తిరసైకా
స్వాదనసుకరానందో
త్పాదనదివ్యమతి నగుచుఁ దగ నెఱిఁగింతున్. 69

వ. అనిన వాంబికేయుండు నట్లకాక యెఱింగింపు మనుటయు సంజ
యుండు. 70

సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధంబు సెప్పఁబూనుట
సం. 6–16–7

ఉ. ప్రాంశుఁ బయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁ బిం
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వని

స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్. 71

వ. అని పలికి పారాశర్యుం జిత్తంబున నిలిపి నమస్కరించి ధృతరాష్ట్రున
కిట్లనియె. 72

క. వినినదియును నెయ్యెడనేఁ
గనినదియును మునికృపం బ్రకాశం బై తోఁ
చిన యదియును విశదంబుగ
వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్. 73

వ. ఆరాత్రి నిన్ను వీడుకొని మనదండునకుం జని నీకొడుకునగరు సము
చితప్రకారంబునం బ్రవేశించునప్పు డతండు గాంగేయాది కౌరవు
లును నగు రాజులును బరివేష్టింపం బరిమితస్థానంబున నుండ నేనునుం
బొడసూపి యతని యాదరణంబు వడసి కొలిచియుండితిం బదంపడి
సమరవిషయంబు లైన సంభాషణంబుల సమయంబున నమ్మేదినీశ్వరుండు
దుశ్శాసనుం గనుంగొని యిట్లనియె- 74

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు
గయ్య మయ్యెఁ బెద్దకాలమేని
నెదురుచూచుచుండ నొదవె నివ్విధ మిందుఁ
బూని చేయవలయు దాని వినుము. 75

క. కన్నాకు మనకు భీష్ముం
డిన్నరవరుఁ గావవలయు నెమ్మెయి నైనం
దన్నుం గాచిన నితఁడు జ
గన్నుతముగ రణమునం బగఱ నడఁగించున్. 76

ఆ. ఎల్లవారిఁ గాచు నితఁ డని యెప్పుడుఁ
దలఁతు మితనిఁ గావవలయు టేమి
యని తలంచెదేని విను మిందఱకు నిది
వినఁగవలయు నట్టిపని కుమార. 77

వ. సత్యవ్రతుం డగు నిమ్మహానుభావుండు. 78

క. వినుఁ డన్య్వ లెవ్వరును నా
మునుమునఁ బడి బ్రదుక రాలమున నేను శిఖం
డిని నోర్వఁ జాలఁ జుండీ
యని మనయుద్యోగవేళ యప్పుడ చెప్పెన్. 79

ఉ. ఏమఱి రక్ష సాలని మృగేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు సం
గ్రామములోనఁ గన్గలిగి కావక తక్కిన నాశిఖండిచే
నీమను జేంద్రుఁ గోల్పడమె యిట్టిది గోల్పులి నిద్రవోవ ను
ద్దామబలంబుమై గొఱియ దాఁకి వధించినయట్టు లుండదే. 80

క. కావున నీయుద్భటరథి
కావలి నివ్విభునిఁ గాచునట్లుగఁ బనుపం
గావలయు మీర లందఱు
నేవలఁ జూచిన శిఖండి కెదురుం డెపుడున్. 81

వ. అని నియమించి కొలువు విరిసి చని యుచితవిధంబున నుండె నంతఁ బ్రభాతం బగుటయు నమ్మహీపతి పడవాళ్లం బనిచి బలుమానీసులను బలంబులను బవరంబునకు వెడల నియోగించిన శంఖదుందుభి ప్రముఖ మంగళతూర్య నిస్వనంబులను నవ్యైసాధనంబులు సమకట్ట సముచిత పరివారంబునకుం జెప్పెడు దొరల పలుకుల గంభీరనాదంబులను గట్టుమట్లు కదలఁ దిగిచినం జెలంగు కరితురంగంబుల బృంహితహేషిత ఘోషంబులను బూన్పం దిగుచు రథంబుల నేమిస్వనంబులనుం బెలుచ నొండొరులం బిలుచు పదాతుల యెలుంగుల విపులధ్వనులనుం బేర్చిన మహారవంబున శిబిరంబు చంద్రోదయఘూర్ణమానమహార్ణవంబును గ్రేణి సేయుచుండ సూర్యోదయం బైన సైన్యంబులు సెలంగుచు వెడలునప్పుడు. 82

తే. కనకభూషణజాలంబుకతన గజము
లెరవళులు వోవు కొండల నెనసి యొప్పె
వల్గనంబుల హేషలవలన నబ్ధి
ఘనతరంగంబు లనఁ దురంగములు వొలిచె. 83

క. అరదములు సవరణంబులఁ
బరపై యొక్కొక్క యూరిపరపున నరిగెం
బరుసనిపలుకుల నాకృతి
పరుషత నసురాలివోలె భటతతి మెఱసెన్. 84

వ. అట్టియెడ, 85

మ. పరిధానంబును దేరు నశ్వములుఁ జాపంబుం బరిస్ఫీతవ
స్త్రరుచివ్యాప్త సువర్ణతాళమయచంచత్కేతువున్ వర్మముం
గర మొప్పం దెలుపారు వెల్గొడుగుతో గంగాసుతుం డా సుధా
కరుఁడుంబోలె వెలింగె దర్ప మెసఁగం గౌరవ్యసైన్యాబ్ధికిన్. 86

సీ. కాంచనమయవేదికాకనత్కేతనో
జ్జ్వలవిభ్రమం బొప్పఁ గలశజుండు
గనకగోవృషసాంద్రకాంతికాంతధ్వజ
విభవవిలాసంబు వెలయఁ గృపుఁడు
మణిసింహలాంగూలమహితకేతుప్రభా
స్ఫురణంబు మెఱయంగ గురుసుతుండు
రత్నశిలారశ్మిరాజితకదళికా
మహిమ శోభిల్లంగ మద్రవిభుఁడు

తే. వెడలి తమతమ చతురంగవితతు లెల్ల
నుచితగతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి
సంగరోత్సవసంభృతోత్సాహు లగుచు
నగుచు దగుమాట లాడుచు నడచి రెలమి. 87

క. సమరక్రీడాసన్నా
హము లొప్పగఁ దక్కఁగలుగునట్టి దొరలు ద
ర్పము పల్లవింప వెడలిరి
తమతమ కేతువులు గ్రాల ధరణీనాథా. 88

వ. వా రెవ్వ రంటేని వినుము. 89

క. కల్పితదృఢచతురంగా
నల్పం బై గండు మిగిలి యాదవబల మా
కల్పోజ్జ్వలతఁ గొలువ నవి
కల్పుఁడు గృతవర్మ సనియె గాఢస్ఫూర్తిన్. 90

క. రథములు దఱచై చెలువగు
పృథుసైన్యముతోడ బంధుబృందముఁ దానుం
బ్రథనోత్సుకవృత్తి మహా
రథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ బ్రస్ఫురితగతిన్. 91

మ. చలదుర్వీధరలీలఁ గ్రాలుమదవత్సామోద్భవస్తోమ మ
గ్గల మై యేచినసేన లొప్పఁగ దిశల్ గంపింప విందానువిం
దులుఁ గాళింగ మహీవిభుండు భగదత్తుండున్ భవత్సేనయో
ధులకుం గన్నులపండు వై నడచి రుత్తుంగాంగసంరంభులై. 92

క. కొడుకులుఁ దమ్ములుఁ గుఱ్ఱపు
దడములుఁ బెక్కైన బలవితానముఁ దగు మై
నడపించుచు మెలపున సం
గడములతో నరుగు శకుని గడునొప్పారెన్. 93

మ. తనతోఁ గాల్వురు సాలఁ గల్గు బలసంతానంబుతోఁ బ్రీతిఁ బు
త్రుని వీరోత్తము సోమదత్తు విఘసద్యోద్ధర్వదుర్దాంతుఁ బౌ
త్త్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణిసేయంగ నే
చినపెం పొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్. 94

వ. కాంభోజరాజగు సుదక్షిణుం డక్షీణవిభవంబున వెడలె మఱియుం గోసలపతి యగు బృహద్బలుండును మాహిష్మతీపురనాథుం డగు నీలుండును త్రిగర్తేశ్వరుం డగు సుశర్మయు ననురేంద్రు లగు నలంబస హాలాయుధులును సాల్వ సౌవీర శూరసేనాభీరయవన వసుధాధిపులును లోనుగా ననేక దేశాధీశు లాత్మీయచతురంగబలసమన్వితులును నిజ ధ్వజవిరాజమానులును నానాభరణోజ్జ్వలాంగులును నయి సంగర కౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగి రివ్విధంబునం బది

యక్షౌహిణులు నడవం బదునొకండవ యక్షౌహిణితోఁ గురుక్షోణీవల్ల
భుండు విస్ఫురితభూషణభూషితం బైన గంధసింధురంబు నెక్కి వెలి
గొడుగులు మెఱయం దొడవులం దఱచైన వజ్రంబుల యుద్దామంబు
లగు దీధితిస్తోమంబులను జామరంబులుం గలయం బొలయ బహురత్న
ప్రభావిభాసితం బయిన భుజంగకేతనంబు గ్రాలఁ గెలంకుల దుశ్శాసన
దుర్మర్షణ వివింశతి వికర్ణాదు లగు సోదరులు వాహనవల్గనంబులు
మెఱసి మెఱుఁగారు తమతమసిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చను
దేరం జనియె నిట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండగదాదండ
కుంతక్షురికాముసలముద్గరతోమరపరశుభిందిపాలశూలప్రముఖ నిఖిల
హేతివ్రాతంబులను భర్మపరికర్మ నిర్మాణశోభిత వర్మంబులను వివిధ
వర్ణవిచిత్ర తనుత్రాణంబులును మణిగణోజ్జ్వలజ్వాలాజటిలకేతనం
బులం బరమాభీలసుందరసమ్మర్దం బయ్యె నట్లునన్న యప్పుడు. 95

తే. అమరుతొడవుల వజ్రాంశు లంచపిండు
కరణి హరినీలములఁ బేర్చుకాంతి యళుల
పగిది మాణిక్యరుచి పద్మభంగి మెఱయఁ
గురుబలంబు గెందామర కొలనిఁ బోలె. 96

వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభులనెల్లం గూడం బిలిపించి వారలతో
నిట్లనియె. 97

భీష్ముఁడు నిజయోధులకెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట
సం. 6-17-7

క. ఆరయ వివృతస్వర్గ
ద్వారము రాజులకు నాహవం బందు మహో
దారులు దొల్లియు నరిగిరి
మీ రీమార్గమున నడవ మెయికొను టొప్పున్. 98

క. ఇంటం దెవులునఁ జచ్చుట
కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్

అనిన విని యతం డట్లు చేయుదు నని సాత్యకివిరాటులు వలపటను నభిమన్యు పాంచాలకేకయులు దాపటను నకులసహదేవద్రౌపదేయ పురస్సరుం డైన యుధిష్ఠిరుండు నడుమను జేకితానకుంతిభోజులు వెనుకనుంగా నొనర్చి యగ్రభాగంబున శిఖండి నునిచి యతనికెలంకుల డాసి భీమసేనఘటోత్కచు లొక్కవలనను బార్థుండుఁ దాను నొక్క దిక్కునను నిలిచి తక్కినయోధవీరుల గలయం జేర్చి గట్టిమొనగా నమర్చె ని ట్లుభయసైన్యంబులుం బన్ని భేరీభాంకారశంఖాదినిస్వన గర్జాస్ఫూర్జితబహుశంబుగా నొండొంటిం దాఁకె నట్టిసమయంబున.191

క. చెంగట నభిమన్యుండు పి
శంగతురంగప్రచారచంచద్రథుఁ డై
పొంగి మనదిక్కుప్రజమీఁ
దం గవిసెం జిచ్చు దూది దరికొనుమాడ్కిన్. 192

వ. ఇట్లు గవిసి.

తే. మెఱసి మండలచారి యై కోటిఁ ద్రిప్పి
నట్లు గురుకృపసింధురాజాదు లైన
యోధవీరులు వెఱఁగంద నులివు మిగిలి
తరువఁబడునద్రిక్రియ సేన దిరుగఁ బడఁగ. 194

వ. ఇట్లు మాఱులేక తఱుముచున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలంబుసుతో ని ట్లనియె వీఁడు రెండవయర్జునుం డై మనబలంబులఁ గలంచుచున్నవాఁ డర్జుననందను నెదుర్కొన నీవకాని మాఱు లే దేము పాండవుల కడ్డపడియెదము నీవు వీనిం బొదివి భంజింపుము. 195

అలంబసుఁడు దుర్యోధన ప్రేరితుం డై యభిమన్యునిపైఁ గవియుట
సం. 6-36-24

క. అనపుడు నతండు దుర్దమ
దనుజావలి మున్ను గాఁగఁ దఱిమెం గుంతీ
తనయబలము గారాకులు
పెనుగాలిం దూలునట్లు భీతిం జెదరన్. 196

ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము సొచ్చి దైత్యులం
గుప్పలుగా మహిం బెలుచఁ గూల్చిన దానవనాథుఁ డమ్ములం
గప్పెఁ గడంగి వారల నఖండ పరాక్రమలీల వారు వాఁ
డొప్పఁటి తేరికూబరము యూఁతగ వ్రాలఁగ నేసి యార్చినన్. 197

క. ఆలోనన తెప్పరి లయ
కాలుండునుఁ బోలె నసురగన్నుల నిప్పుల్
రాలఁగ వారలసిడములు
నేలం బడ వేసి చాపనికరము ద్రుంచెన్. 198

వ. త్రుంచి నవ్వుచు. 199

తే. ఒకనినొకని పైపై దు మహోగ్రభాసు
రాస్త్రముల నేసి నొంచిన నతనిమదము
సొంపు సోదరవ్యథయును జూచి యదరె
నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు. 200

వ. అప్పు డుభయసైన్యంబులవారును వెఱఁగంది 201

క. దనుజుఁడు మాయాధికుఁ డ
ర్జున తనయుఁడు దివ్యశరధరుం డెట్లగునో
యనుచుండఁగ నయ్యిరువురు
నని సేసిరి వృత్రవాసవాకృతి దోఁపన్. 202

క. ఇతరేతరశరకృత శో
ణితధారలు నిగుడ నపుడు నిర్భరదావ
ద్యుతు లడరఁ బోలుచు నగముల
గతిఁ బొలిచిరి వారలప్రకంపోన్నతులై. 203

క. దనుజేశ్వరుండు మాయం
బొనరించినఁ దమము గవిసె భూనాయక ఫ
ల్గునసుతుఁడు భాస్కరాంబక
మున వెలుఁ గొనరించె సురసమూహము వొగడన్. 204

తే. అసుర వెండియుఁ బెక్కు మాయలు ఘటింప
శక్రపౌత్త్రుండు దివ్యాస్త్రజాల మడరఁ
జేసి యన్నింటి నడఁగింప చెలఁగి నొంప
రథము డిగి పాఱెఁ బెలుచ నారాక్షసుండు. 205

క. రక్కసుఁడు విఱిగినం గడు
నుక్కున సౌభద్రుఁ డడరునురవడి గని న
ద్దిక్కులం బఱచెం దమలోఁ
జిక్కువడుచుఁ గౌరవేంద్రుసేనలు భీతిన్. 206

వ. అప్పుడు పెక్కండ్రు రథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యు
పయిం గవిసిన. 207

తే. అతఁడు దానికిఁ దలఁకక యందఱకును
నన్నిరూపు లై పోరంగ నర్జునుండు
సరభసంబుగ భీష్ముపై నురవడింపఁ
బొంగి యిరువాఁగు నిరువురఁ బొదివె బెరసి. 208

వ. అట్టి సంకులసమరంబున నభిమన్యుపై నడరు కృపాచార్యుం దాఁకి
సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ తునిమి
యతని విల్లు ద్రుంచినం గోపించి. 209

క. ఆ సాత్యకి వేఱొకవి
ల్లాసురగతి నెత్తి యుగ్రమగునారాచం
బేసిన నాతడు కేతు
వ్యాసక్తుం డయ్యె మూర్ఛ వచ్చి నరేంద్రా. 210

క. ఆలోనన తెలిసి మెఱుఁగు
వాలికతూ పాతఁ డతని వక్షము నడుమం
గీలించి సిడము గ్రక్కున
నేలం బడనేసి యార్చె నింగి వడంకన్. 211

వ. దానికిం గినిసి శినిమనుమండు పొగరు మిగులు నారాచనిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగు నుగ్రగభస్తియుంబోలె నైనం గనుంగొని. 212

క. ద్రోణాచార్యుండు సుత
త్రాణపరత్వమునఁ గృష్ణుతమ్మునిపై న
క్షీణోద్ధతిఁ గవియుడు గీ
ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁజొచ్చెన్. 213

చ. అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లను ద్రోణుఁ డాత్మ న
ర్జునునకు గూర్చు నాతఁడు గురుం గని యెంతయు భక్తి సేయు వా
రని దమలోన నట్లు వెస నప్పుడు దార్కొని యెట్లు వోరిరో
వినఁ గల దేర్పడం జెపుమ విశ్రుతభంగిగ నాకు సంజయా. 214

వ. అనిన నా సూతనందనుం డతని కిట్లనియె. 215

క. క్షాత్రము దలకొని సంగర
ధాత్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్
పౌత్త్రులు శిష్యులు మామలు
పుత్త్రు లనం గలదె తొడరి పోరనవలయున్. 216

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధముసేయుట

సం. 6-93-4

వ. వినుము. 217

సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యు మూఁడు నా
రసముల నేసి యుగ్రంపుటంప
వెల్లువ వఱపిన వెగడొంద కాతఁ డా
తని మేనఁ దూపులు దఱుచు గాఁగ
నాఁటించె నంత భూనాథుండు పురికొల్పఁ
గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ

నరుఁ డేచి వాయుబాణమ్మున నమ్మొనఁ
దూలింపఁ గుంభజు శైలశరము 218

ఆ. వైచి యుడుప నలిగి వాసవి నారాచ
వర్షమునఁ ద్రిగర్తవరుని పుత్ర
చయముఁ దెరలుచుటయు జనపతి కృపశల్య
బాహ్లికులునుఁ దానుఁ బార్థుఁ దాఁకె.

వ. అట్లు దాకుటయు వారల నశండు గన్నెరాకమ్ములం జీకాకుపఱిచె నట్లు గురుండు మొదలైన యందఱకును నా ధనంజయు పోరు దలముసుక లయ్యె గురుపితామహుండు ధర్మసూతి యున్న తిట్టు కుఱికి తలలు చెండాడె శకుని భూరిశ్రవసులు గవలఁదలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభసేనలతోడం దొడరి భీమసేనుం బొదివిన. 219

క. గిరి డిగు కేసరిచాడ్పున
నరదము డిగి భ్రమితపటుగదాభీలత నా
కరువలిపట్టి యుఁ గవిసినఁ
గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తి గతిన్. 220

తే. గ్రందుకొని యిట్లు మాతంగఘటలు విఱుగ
నా శ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ
బోక నిలిచి యమ్మారుతపుత్త్రుతోడఁ
దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు వఱపి. 221

వ. అప్పుడు గాంగేయుండు సేయు దారుణ రణంబు ధర్మపుత్త్రునకు భరంబైన నతం డెలుంగెత్తి పేరుపేరం బిలిచి చేయి పిచిన నా కళింగ నాథ భగదత్తుల విడిచి యపుడుగఱచుచు. 222

క. కలయఁగఁ గరములఁ జరణం
బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం
దలి రెసఁగిన నడమామిడి
చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. 223

వ. అంతకుమున్న ధృష్టద్యుమ్న శిఖండి విరాటద్రుపదులు ధర్మనందనున కడ్డపడి భీష్ముపై నడరి బహుప్రకార విశిఖంబుల వెగడు పఱచిన నతం డలిగి శిఖండి నేయ నొల్లక యమ్మువ్వురను మూఁడేసి వాఁడి తూపుల నేసిన నా వీరరథికులు హుతాగ్నిత్రయంబునుం బోలెఁ బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని నొప్పించిరి వృకోదరుఁ డద్దెసం గవియుటం గనుంగొని కేకయగణ శైనేయ ద్రౌపదేయులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయంగల మేటిమగలెల్లను మిన్నేటి కొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరుదెఱంగుల దొరలును బలంబులును నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడుచుండం జండ రశ్మి వినువీథి చక్కసగంబునకుం జనుదెంచె నట్టియెడ. 224

తే. రథములను సామజములఁ దురంగమముల
నుఱక నెత్తుటేఱుల నీఁది తఱియ నడచి
పోరి రేటును వ్రేటును బోటు నొక్క
యలవిఁ జెలఁగంగ నుభయసైన్యములవారు. 225

వ. అప్పుడు మన బలంబులజనంబులు 226

క. ధృతరాష్ట్రిందును బుత్త్రిలు
నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ
ర్మతనూజు గెలువవచ్చునె
మతి లేరై రింక నేటిమాటలు మనకున్. 227

ఆ. అనుచు వగచు పలుకు లాలించు భీష్మాది
యోధవరులతో సుయోధనుండు
చెనఁటిమాట లేమి విని యొద రనిన వా
రదియు నదియు విననియట్ల పోరె. 228

వ. పరాక్రమక్రీడలు సలుపుచుండి రాసందడికయ్యంబునం గిమ్మీరమర్ద నుండు గదపండువు సేయుచుండె నప్పుడు. 229

క. సరభసముగ సారథి దన
యరదముఁ దెచ్చుటయు కిన్క యతని శితశర
స్ఫురణాపరిణతి బాహ్లికు
విరథుం గావించె సురలు వినుతింపంగన్. 280

తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ
పాతమున నొంచి యార్చినఁ బాండుపౌత్రుఁ
డతనిసారథిఁ బడ నేసిఁ యంతఁబోక
తురగములఁ జంపి యాతని త్రుళ్లడంచె. 281

వ. అక్కుమారుండును దుర్ముఖునిరథం బెక్కెఁ బాంచాలపతి గుంభ
సంభవుపై నడరి యతని మేన నానాస్త్రంబులు నించిన. 282

క. ద్రోణుఁడు గోపించి తను
త్రాణం బఱువుల్లు సేసి తనువున రాజ
ద్బాణంబులు గ్రుచ్చిన సం
క్షీణబలుం డై యతండు సిగ్గఱి తొలఁగెన్. 283

సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి
కృష్ణుపై నమ్ములు గీలుగొలుప
నలిగి యన్నరుఁడు వాలంపకాలువలోలి
నడరించుటయు వాని యఖిలబలముఁ
జెలిసమ్మెటలను చేరుకోలలఁ ద్రేసి
యంకుశంబుల నూఁటి యతిరయమున
వాహనంబులఁ దోలు వారును విండ్లును
బలకలు వైచుచుఁ బరచువారు

తే. నైన మీతండ్రి క్రీడిపై నడర నడుమఁ
జొచ్చె సాత్యకి యన్నదీసుతుఁడు శక్తి
వైవ మెయి వాల్చి యది పట్టి వైచె మగుడ
నాతఁ డాభీష్ముఁ డెడఁ దునుమాడె నధిప. 284

వ. ఇట్లు త్రుంచి. 285

క. ఆలోకన మెయిఁ దొమ్మిది
వాలమ్ములు నాటఁ బాండవ వ్యూహము కుం
డాల రథఘోటసుభటా
ళీతలఁ దల కడచి పొదివె భీష్ముని నంతన్. 236

దుర్యోధనుఁడు శకుని దుశ్శాసనుల భీష్మునకు సహాయులుగా బంపుట

సం. 6-101-1

క. కని కౌరవపతి దుశ్శా
సనుతో ని ట్లనియెఁ గంటెఁ శాంతనవుని పై
ఘనసేన ద్రోఁచెఁ జని కై
కొనుఁ డీవును సౌబలుఁడు నకుంఠితవృత్తిన్. 237

క. అనవుడు నయ్యిరువురు సే
పునఁ గదియుడుఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో
ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్. 238

వ. ఆపదివేవురు నెఱరావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి యెక్కినం బాండవబలంబు మహామత్స్యసమూహవిహారంబునం గలంగు మడువునుంబోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుం డును గవలును వివిధవిశిఖపరంపరలు వరగింప ముందటికాళ్లు దునిసిన ద్రెుగ్గతిలంబడియును మోరలు పఱియ లైన నెఱిదప్పం గూలియు గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు ద్రెవ్విన వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱగినం జెనఁటి దిరిగియు ననేక ఘోటకంబులు రూపఱిన నేపఱి యత్తురంగని కరంబు లేటమొగంబు వడి చెదరి కనుకనిం బఱచిన. 239

క. భేరీశంఖాదిరవ
స్ఫారత నప్పాండుపుత్రబల మేచుటయుం
గౌరవపతి శల్యునితో
గారవమున నిట్టు లనియెఁ గడు దీనుం డై. 240

క. వెలివిరిసి వచ్చు జలనిధి
పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్రుని బలుగో
ల్తల నిలువరింప నీ వొక
చెలియలికట్ట వయి మమ్ముఁ జేకొను మిచటన్. 241

ఆ. అనుడు నతఁడు పాండవాగ్రజుఁ గవలను
దాఁకి విపులబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదివి మారిమసంగిన
ట్లయినఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు. 242

క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ
బెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్
గ్రక్కునఁ దఱిమిన నయ్యిరు
దిక్కుల సైన్యములు నత్యుదీర్ణత బెరసెన్. 243

వ. ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగమథనం బగు ప్రధనంబు చెల్లె నట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిన నారసంబు లను కిరణంబుల పరగించి. 244

సీ. పంద్రెంట బంద్రెంటఁ బాండవాగ్రజుని భీ
మునిమాద్రికొడుకుల మూఁట మూఁట
నేడింట నేడింట నేచి సాత్యకిని ధృ
ష్టద్యుమ్ను నొప్పించి సమదవృత్తి
నార్చిన మాత్స్యపాండ్యానీకములును సో
మక వరూథినియును మగధబలముఁ
గాశసైన్యంబుఁ గరూశసేనయు నొక్క
పెట్ట రయంబున భీష్ముమీఁద

తే. నురవడించిన బాండవోత్కరముఁ గృష్ణు
తమ్ము బాంచాలనందను సమ్ముఖమున
కడరనీ కాఁగి యందఱ కన్నిరూపు
లై మహారణ మొనరించె నస్త్రగురుఁడు. 245

ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భటశౌర్యసారదు
ర్దాంతపరాక్రమస్ఫురణ దాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథితకంపితపాతితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దనరథంబుగతుల్ మెఱయం బ్రదీప్తుఁడై. 246

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణవ్రాతంబు దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగన్. 247

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడిగొని మార్కొను మగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱగుపడి యుండ మఱియునుం గడంగి దుర్వారంబు లగు దివ్యాస్త్రంబులు దీటుకొల్పి యే దిక్కు సూచినం దాన యై రథికులను హాస్తికులను నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున బ్రమోదుపడిన యుద్యానంబు చందంబున నగుచున్న చోట్లును గాలుబలంబులం గనుపుకొట్టిన గాలు చేయి తల డొక్క యని యేటుపాటు లేక వండం దఱిగినయ ట్లున్న యెడలును బెక్కు దెఱంగుల చప్పుళ్లు నిగుడ రథచయంబు నవయవంబులుం గరిహయనికరంబుల యెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదివిన వెదురుటడవి తెఱంగునం దోఁచుపట్లును దఱచు గొడుగులు విటతాటనంబు సేసినం బెనుగాలిం జిక్కువడిన కుసుమితకాశవనంబునుం బోలు చక్కట్లును బహురత్నమయమకుటాది భూషణవ్రజంబు వివిధ వర్ణచామర జాతంబు నఱికిపడ వైచినం బ్రబలోద్ధతలులాయలులితం బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించు ప్రదేశంబును నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండువడియుఁ గలంగం బాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహల బహుళంబు లగుటం గనుంగొని గోవిందుండు. 248

ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచు చున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము దోఁపఁగఁ జేయక యున్కి యొప్పునే. 249

వ. అనిన వివ్వచ్చుండు విచారడోలాయత్తం బగు చిత్తంబుతోడ నిరుత్సా
హుం డై యున్నం జూచి వెన్నుం డతని కి ట్లనియె. 250

క. మును మత్స్యనాథునగరం
బున సంజయుతోడ నీవు పొంగుచు బె ట్టా
డినమాట లెల్ల మఱచిన
నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా. 251

వ. అనుటయు నర్జునుండు. 252

ఆ. సకలబంధుజనులఁ జంపి కౌరవహీన
మైన రాజ్యమహిమ యేను బడసి
యనఘ యేమి సుకృత మాచరించినవాఁడ
నగుదు మనసు గొలుపదయ్యె ననికి. 253

వ. అయిన నీతో నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటికొడుకుం బడవై
చెదం దేరు నడవు మనుటయు నారాయణుండు నదీనందను స్యందనంబు
నకు సమ్ముఖంబుగా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలి సైన్యం
బులు గూడికొని గాంగేయుపయిం గవియ నతండు సెలంగి మహాస్త్ర
నికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి సింహనాదంబు సేసి 254

మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిన్ గాండీవి యంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశరస్యూతాస్యముల్ గాఁగ స
త్వరుఁ డై యేసి రథంబు గూడఁ బొదివెఁ బాలంప మొత్తంబునన్. 255

వ. అప్పుడు. 256

తే. బిఱువోయి రథ్యంబులు మాఱుమొగము
వడినఁ దా నొచ్చి యుండియుఁ దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్ముని విల్లు దునిమె. 257

క. అతఁ డొండొకవి ల్లెత్తిన
నతిరయమున నదియుఁ దునుమ నాతం డౌ రా
శతమఖనందన యనుచును
ధృతి వేఱొకవింట శరతతిం బరఁగించెన్. 258

క. ఆబెట్టిదంపుటంపఱ
చే బీభత్సుండు నొచ్చి చేష్పడి మఱియుం
దా బంటుతనమ పటుబా
హాబలముగఁ బోరుచుండె నంగము దూలన్. 259

క. వివ్వచ్చునొవ్వు నెంతయుఁ
గ్రొవ్వున భీష్ముండు గడఁగుకో ల్తలయుం ద
క్కెవ్వరు నాతనిఁ జేరక
దవ్వుల నిల్చుటయుఁ జూచి తనచిత్తమునన్. 260

క. దారుణరోషం బడరఁగ
నారాయణుఁ డపుడు సైరణం దొఱఁగి వేసం
దేరినొగలఁ బగ్గము లిడి
క్రూరత మునికోల యెత్తికొని యిల కుఱికెన్. 261

శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకి బోవుట

సం. 6-102-52

వ. ఇట్లు లంఘించి. 262

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణి కం
ధరముల్ ముగ్గఁబడఁ దిశావలయ ముత్కంపంబు గా నీబలం
బురులంబాఱ గ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్. 263

తే. లలితపీతాంబరంబు విలాస మొప్ప
సింహానాదోద్భటం బగుచెలువుతోడ

మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయ వచ్చు
కారుమొగి లనఁ గృష్ణునాకార మొప్పె. 264

వ. అట్టియెడ. 265

క. బలుజీవము వోయిన వెలు
వెలఁ బాఱుచు నీదు యోధవీరులు వొలిసెం
బొలిసె నదె భీష్ముఁ డనుచును
గలఁగం బడి యట్టు లెత్తి కనుఁగొనుచుండన్. 266

చ. కనుఁగొని భీష్ముఁడుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మహాత్మ వికస్వరపుండరీకలో
చన యిది లెస్స నా కిచట శాశ్వతమైనయశంబు నచ్చట
న్వినుతికి నెక్కుసద్గతియు నీదయఁ జేకుఱఁ జేయు మిష్టమున్. 267

వ. అని పలుకునంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గ నుఱికి వెన్నుని వెనుక నెయిది కరంబులఁ గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం బోవం బోవఁ బదియడుగులకొలంది నా కౌంతేయుండు పదస్థైర్యంబును బాహువీర్యంబును మెఱయ మహీ తలం బూనిమెట్టి నిలువంబట్టి నిట్టూర్పు నిగిడించుచు నర్దనుజ మర్దనునితో నిట్లనియె. 268

ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ మేమను నించుకసేపు పోరులోఁ
డయ్యుట దప్పె నాపయిఁ గడంగిన భీష్మునిపాటు సూతు రా
వయ్య రథంబుమీఁది కిటు లాశ్రితమానసము వీటిఁ బుత్తురే. 269

వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె నయ్యిరువురు నెక్కిన యరదంబు శిఖరద్వయసుందరం బైన శైలంబునుంబోలెఁ బొలిచి నిలిచినం బ్రళయకాల భైరవరవం బగు వారిదంబు కరణి గర్జిల్లుచుఁ బటునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడు వఱచి యచ్చట నొండొరుల మెచ్చక యతిమి తతిమిన

వైరుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుం డై పరిశ్రాంతులైన కృష్ణార్జునులును భీతు లగు భీమసేనప్రముఖులును జేయునది లేక చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి చలిచీమల గాలం జముకు చందంబు దోఁచె నయ్యవసరంబున. 270

క. తా న స్తశిఖరి మఱువడఁ
బోనియపుడు పాండురాజపుత్త్రి విరాజ
త్సేన పొడ వడఁగు నను కృప
నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా. 271

వ. అట్టియెడ ధర్మతనయుఁ డతిఘోరం బగుసంధ్యాసమయంబునం బంక నిర్మగ్నయైన గోవునుం బోలె నున్న నిజసేనంజూచి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యప్పటికిం దిగుచుటయు కర్జంబుగాఁ దలంచి తగు వారల నెల్లం దివియ నియమించి. 272

క. గాంగేయుచేత నెంతయు
భంగపడితి మనుచు వగచుపార్థాదులు ద
న్నుం గొలిచి చనఁగ విడిదల
కుం గడువిన్న నయి పోయెఁ గురువంశనిధీ. 273

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోహటించి పోయినం దారును దమ బలంబులఁ దివియ నియమించి. 274

చ. ఎలమి నమస్కరించుచు నహీనపరాక్రమభంగు లేర్పడం
బలికి యుదాత్తవాక్యములఁ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్బలసి భవత్తనూజులు మనంబులు నిండి ముదంబు మోములం
వెలి విరియంగ నేఁగిరి నవీనవిభూతి నివాసభూమికిన్. 275

వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవనాఁటి బవరంబున బెండువడి యా నిశాసమయంబునందు రహస్యప్రకారంబున. 276

క. మనమున విషాద మడరఁగ
ననుజులఁ గూర్చికొని దానవాంతకుసదనం

బునకుం జని యి ట్లను నా
తనితో నాత్మీయకార్యదశ దెలియుటకున్. 277

క. కార్చిచ్చు గవిసి మృగతతి
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ
రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే. 278

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను నిర్వ్యాళంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము కొన్న యట్లగునె నిశ్చింతంబునం గాననం
బునకుం బోయెదఁ దమ్ములం గొని తపఃపూజ్యుండ నై యుండెదన్.

క. మున్నును నేఁ గారణముగ
నన్నియుడుమ లనుభవించి రనుజులు వీరిం
గన్నారఁ జూతుఁ గాని జ
గన్నుత భీష్మునకుఁ గోలుగా నీఁ జాలన్. 280

వ. నీకు మాదెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు దక్కి ధర్మవిరోధంబు
గాకుండునట్టి యొక్కతెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని
శౌరి సాంత్వనవచనంబుల ననునయించి యతని కి ట్లనియె. 281

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ
వత్యద్భుతబాహువీర్యు లనుజన్ములు దా
ర్గత్యము గల్గునె నీకు న
మాత్యుఁడ నై యేను రాజ్యమహిమ నొసర్తున్. 282

క. వగవఁగ నేఁటికిఁ బార్థుఁడు
దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నున్
మగిడింపక చూచుచుండు మనుజాధీశా, 283

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి
నాకు నతనికి నై యేను నరవరేణ్య
కూర్మిమై నిత్తుఁ గండలు గోసి యైన
నరయ నాతండు నాయెడ నట్టివాఁడ. 284

వ. ఉపప్లావ్యంబున నితండు సంజయుతో నాడిన మాటలకు నులూకుండు వచ్చినప్పు డతని పలుకులం బుట్టిన బెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయవలయు నేను నీ రెండెడలం బెక్కులు పలికినవాఁడ మీకిరువురకు నొండొరువుల పలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 285

క. కయ్యము సేయక తగుసా
హాయ్యము సేయఁ గలవాఁడ నని పలికితి ని
న్నియ్యెడ నేఁ బొంకితునె
దయ్యము నా కేల యిట్టి దైన్యము దెచ్చెన్. 286

వ. దాకు దేవవ్రతునకు నొక్క సమయంబు గల దమ్మహాత్ముండు కౌరవులకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం బగు కార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు నాకు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా ని ట్లనియె. 287

ఆ. అకట తండ్రి నచ్చినంతనుండియు మమ్ము
నరసి ప్రోచినట్టి యనుఁగుఁదాతఁ
జంప మది దలంచుటెంపు సూచితె రాజ
ధర్మ మింత క్రూరకర్మ మగునె. 288

వ. అనవుడు. 289

తే. విని మురాంతకుఁ డితఁడు శాంతనవుకడకు
నరుగఁ జూచినవాఁ డని యాత్మ నెఱిఁగి
క్రమ్మరంగ నేతెంచెదుగాక యనిన
యన్నదీసూను తొంటి వాక్యములు దలఁచి. 290

వ. అజాతశత్రునకి ట్లనియె. 291

-: ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట :-

సం 6-108-50

ఆ. నీతలంపు లెస్స నీవు మున్ననినట్ల
కాక భీష్ముఁ డలుక గదిరి పోరఁ
జక్క జూచెనేని శత్రువుల్ వోలియరె
యిప్పు డతనిపాలి కేఁగు మధిప. 292

సీ. నీవు దన్నడిగిన నిజవధోపాయంబ
వశ్యంబుఁ జెప్పు దేవవ్రతుండు
మనము రహస్యవర్తనమున నందఱ
మ్మునను జని యమ్మహాత్మునకు భక్తి
నెరఁగి తెల్లంబుగ హితకార్యగతి విన
యంబుమైఁ బ్రార్థించి యడిగి యతని
సదయమంత్రోపదేశంబున నెగడుద
మని యిట్లు హరి నిశ్చయంబు సేయ
ఆ. నయ్యజాతశత్రుఁ డనుజులు నతఁడును
దాను సౌమ్యవేషధరణ మొప్ప
నతినిగూఢవృత్తి నాపగాసుతు మంది
రమున కరిగి సముచితముగఁ జొచ్చి. 293

వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణమిల్లిన నతం డత్యాదరంబునఁ బేరువేర వార లందఱ సేమంబు లడిగి యి ట్లనియె. 294

క. ఇచ్చటికి మీర లందఱు
వచ్చినపని యేమి యేది వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను
జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్. 295

వ. అని తెలి వొందిన మొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని కి ట్లనియె. 296

క. మా కెమ్మెయి సామ్రాజ్యము
సేకుఱు నెబ్భంగి బహుళసేనోత్సాద
వ్యాకులత రాక తక్కుం
జేకొని య త్తెఱఁగు కరుణఁ జెప్పఁగవలయున్. 297

క. అనవుడు నేఁ బెనఁగఁగ మీ
కనఘా సైన్యక్షయంబు నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున
నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్. 298

వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుం డి ట్లనియె. 299

ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చిన రుద్రుచందమున వ్రాలుదు పీ వనిలోనఁ నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిం గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే. 300

క. అనుటయు ని ట్లను గంగా
తనయుఁడు నీ చెప్పినట్ల తథ్యం బది న
న్ననిమిషులు గెలుతు రే చే
ధను వుండఁగ వినుము తద్విధము దేటపడన్. 301

తే. ఇట్టివానిఁగ నన్ను మీ రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా యిట్టు లడుగ
మీకుఁ బ్రియ మైన కార్యంబు మెయికొనంగఁ
గనుటకం టెను సుకృతంబు గలదె నాకు. 302

వ. ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందిన నన్ను జయింప సమకూరు జోడు వుచ్చినవానిని గైదువు బెట్టినవానిని సిడంబు డించిన

వానిని నంగనను నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడిన వానిని భ్రాతృహీనుని నపుత్రకునిం గని యేటుఁ బోటుఁ దక్క సమరంబు సేయ మానుదు మఱియు నొక్క వ్రతంబు పూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చిన పురుషత్వంబు గలవానితోడఁ గయ్యంబు సేయంగావున మీకు నొక్క యుపాయంబు సెప్పెద ద్రుపదు నపత్యం బైన శిఖండి యట్టివాఁ డగుట మీ రెఱుంగుదుర కాదె విశేషించి ముందటి పుట్టువున నంగన యగుట వాని కెదు రేయకుండుదు నర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి యే నేయుట మానిన యెడ నొప్పించి పడవైచునది పదంపడి బంధుమిత్రులగు ధార్త రాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నావను వేను బవిచినట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతునిచేత ననుజ్ఞాతు లై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవుచున్న సమయం బున బీభత్సుండు. 303

ఆ. సురనదీసుతుండు పరలోకగతి నిరీ
క్షించుటకును దాను గృతకవృత్తిఁ
జంపవలయుటకును సవిషాదమానసుం
డగుచు నిట్లు అనియె నచ్యుతునకు. 304

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధ
ర్మరతు వయోవృద్ధు లోకమాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ
బురుషోత్తమ చంపబుద్ధి పుట్టదు నాకున్. 305

ఆ. నన్నుఁ బాంసుకేళి నున్న నర్మిలి నెత్తి
మేనిదూళి దనదుమేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మా తండ్రిగుణము ల
గ్గించి కన్నునీరు నించు నతఁడు. 306

ఉ. అక్కట తండ్రి లేని మము నర్మిలిఁ బెంచిన తాత నిమ్మెయిం
ద్రెక్కొనఁగా దతండు సముదీర్ణభుజాబలశౌర్యశాలి యై

యిక్కడిసేనఁ జక్కడిచె నేనియుఁ జూతున కాక ధర్మముం
దక్కుట కోర్వఁ జాలుదునె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. 307

వ. అనిన విని కృష్ణుం డా జిష్ణున కిట్లనియె. 308

ఉ. క్రూరత కోర్చి యించుకయు రోయక వైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ
గో రరి గొందు సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి వచస్పతి సెప్పుట యప్రసిద్ధమే. 309

చ. అనిమొన నోర్తు భీష్ము నని యాడిన నీదగు పూన్కి లోక మె
ల్లను వినియుండఁగా నిటు చలం బెడలం జన దెట్టులైనఁ జం
పన తగు రాజధర్మపరిపాలన గా కిది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్. 310

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను నాద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయవధార్థ మం డ్రదియుఁ దప్ప దతండును వాని నేయఁ డే
ను నతని నేయుచందమున నూల్కొని యన్యుల నేయుచుండు వాఁ
డనితరవధ్యకాయుఁ డగు నాయనఁ దాఁ బడనేయు నుగ్రతన్. 311

వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డి ట్లనియె. 312

ఉ. నీ వొకరుండు దక్కఁగ ననింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్
దైవము చూపుపోలెఁ దుదిదాఁకునె యవ్విధ మిట్టు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యెటులు ద్రోచినఁ బోవదు చూచియుండుమీ. 313

వ. అని పలికిన విని యతం డట్ల గాక యప్పటికి నెట్లయిన నట్లయ్యెడు
నని యర్జునుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం
బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీ
కాక్షుని నిజనివాసంబున కనిచి తమతమ నికేతంబులకుం జని యా
రాత్రి సుఖనిద్ర సేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం
డి ట్లనియె. 314

క. పాండుసుతు లేమిభంగి శి
ఖండిం గూర్చికొని యాపగాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు ప్ర
చండతతో సమరకేళి సలిపిరి చెపుమా. 315

భీష్ముని దశమ దివసయుద్ధానుక్రమము

సం. 6-104-2

వ. అనుటయు నా సూతనందనుం డతని కిట్లను సూర్యోదయ సమయం
బున పాండుసూనులు సేనాసమేతు లై వెడలి మోహరించునప్పుడు
ముందట శిఖండిని నిలిపి యతని కెలంకుల భీమార్జునులు వెనుక నభి
మన్యు ద్రౌపదేయులును వారి యిరువంకలం జేకితానశై నేయులును
నట పిఱుంద ధృష్టద్యుమ్నాదిపాంచాలకుమారుల ము న్నిడుకొని
కవల నుభయపార్శ్వంబులం బెట్టికొని యుధిష్ఠిరుండును వీరి సూరెలం
బొదివికొని విరాటద్రుపదముఖ్యు లగు పృథ్వీపతులును గేకయపంచక
ధృష్టకేతులును నిలిచి రి త్తెఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి
రంతకు మున్న మనవారును వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల
నీకుమారు లమ్మహాత్ముం బరివేష్టింపఁ గుంభసంభవతత్సంభవులుం
దక్షిణవామభాగంబులను బృహద్బలకాంభోజముఖ్యు లైన మహీ
పతు లమ్మనుజేంద్రుచుట్టును ద్రిగర్తు లపరభాగంబునను బన్ని బలు
మొన యమర్చుకొని త్రోచి నడచి రి ట్లిరువాఁగును గవిసి వివిధతూర్య
స్వనంబులు నింగిముట్ట నొండొంటిం దాఁకిన. 316

క. సమరం బప్పుడు దనుజులు
నమరులునుం బెనగు చందమై తోఁపఁగఁ భూ
రమణ విను మేమి సెప్పుదు
జముపురమున నగ్గలంపుసందడి యయ్యెన్. 317

వ. అట్టియెడ. 318

మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణ మైఁ గౌరవ్యసైన్యంబు ని
క్కువడం జేయఁగ భీమపార్థులును గో కొమ్మంచు నొక్కుమ్మడిం

గవియం బాండవసేన యుబ్బి యడరంగాఁ జూచి కల్పాంత భై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్. 319

ఆ. కాలుకాలు పెనఁగి కాలుబలంబులు
నొడ్డగెడవుగా రథోత్కరంబు
మ్రొగ్గతిలఁగ గుఱ్ఱములు నేల యద్రువ మా
తంగఘటలు గూలెఁ దత్క్షణంబ. 320

క. కనుఁగొని శిఖండి వెస మా
ర్కొని భీష్ముని నేసె మూఁడు క్రూరాస్త్రములం
గని యతఁడు మరల చూడక
తని నుద్దేశించి పలికె దరహాసముతోన్. 321

ఉ. ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగ నా
కొవ్వమిఁ జేసి యట్టినిను నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం
గ్రొవ్వెపతార నీవు శరకోటి వెసం బరగించితేని నే
నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ. 322

వ. అనినం గోపించి శిఖండియు నతని కిట్లనియె. 323

క. గెలిచితి రాజుల నెల్లను
బలియుం డగుపరశురాముప్రతివీరుఁడ వై
యలవుకలిమి నెఱపిన నీ
చలము బలము నాకుఁ జూపఁ జాలవు కంచే. 324

క. ఏయు మొకనేర్పుమై ని
ల్లేయక క్రీడించి యరుగు మెట్లయినను ను
త్సాయకముల నినుఁ గూల్చెదఁ
జూ యెవ్వత నైతి నేమి సూచెదు నన్నున్. 325

క. నేఁ డెమ్మెయి నైనను నీ
పోడిమి సెడఁ దోన తపిలి పొదువుదు నిన్నున్

వాఁడిమగఁ డనుట యుడుపుదు
వేఁడిమి సొం పెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్. 326

వ. అనుచు మఱియు నయిదమ్ము లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మ
గతంబున నేఁడు శిఖండిచందంబు వింత యయి యున్న యది నదీనంద
నుండు సమయుటకు సమయం బై నదై వదత్తోత్సాహంబున నేచి పలికెం
గావలయు నని యూహించి యుపోద్బలంబుగా నతని కి ట్లనియె. 327

అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట
సం. 6-104-51

ఆ. ఇట్టు లాడి పిదప నేమియుఁ జేయంగ
జాల కున్న మనల జగము నవ్వు
నేను గలుగ నిన్ను నెవ్వరి కేమియుఁ
జేయరాదు భీష్ము నేయు మడరి. 328

వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాల బలంబుపైఁ దఱి
మినం దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌర
వసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ
మన సైన్యంబు దైన్యంబు నొంద నగునే యనవుడు రారాజుతో
నతండు. 329

క. మును పదివేవురఁ జంపుదు
నని యిచ్చినబాస వచ్చె నవనీశ్వర నీ
మనిచినఋణంబు దీర్చితి
విను లా విటమీఁదఁ దఱుఁగువిధ మై తోఁచెన్. 330

ఆ. నేఁటిభంగి సూడ నృపవర పాండవు
లొండె నన్ను వారి నొండె నేను
సమయఁ జేత గలుగు సమసెద రే యొక
మర్త్యుచేత వా రమర్త్యబలులు. 331

వ. అనను నాచేతి బలువు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరార్చులం బ్రచండనరనాథయూథంబులం బొదివికొని పాండవులకుం దేటి చూడ రాక నిర్ధూమదహనస్వభావుం డైన పితామహుప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలువడం జేయం దొడంగిన వారిం గనుంగొని. 332

ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ
పాండ్యకేకయాదిబలము లొక్క
మొగిన త్రోవ నీదుమొనలు మార్కొనుటయు
నపుడు పోరు ఘోర మయ్యె నధిప. 333

వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి. 334

తే. నీవు భీష్మున కలికినం బోవ దేను
గలుగ వెఱ పేల యతనిపైం గవియు మెయిది
కొని మదీయబాణంబులం గుప్పంగూరం
బఱపి కూల్చెద నీతనిం బటురయమున. 335

వ. అనిన నాతనిపలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యుమ్నుండు. 336

క. మనయోధు లందఱును శాం
తనవునిపైం దఱుముం డింద్రతనయుండు గలుగన్
మన మతనికి శంకింపంగం
బని లే దని పలికి యార్చి బలువిడి నడరెన్. 337

వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపదవిరాటులును సాత్యకిచేకితానధృష్టకేతుకేకయమాగధులును మఱియునుం జేయంగలదొరలు నొక్కపెట్ట బెట్టడరిన నిక్కడ గురుపుత్త్రభూరిశ్రవసులును గృతవర్మకృపకాంభోజపతులును వికర్ణదుర్ముఖవివింశవిచిత్రసేనులును లోనైనయోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందనుపయిం గవియు పాండవసైనికులును నతని కడ్డుపడు కౌరవ్యవీరులును జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవసరంబున. 338

క. మొనసి శిఖండిని ము న్నెడి
కొని యురవడిఁ దఱుము నరునకును వెస దుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన
వననిధికిని వేలవోలె వసుధాధీశా. 339

వ. ఇట్లు నిలువరించి. 340

క. ఇరువురఁ గృష్ణుల నాతం
డిరువదిబలునారముల నేసెం గ్రోధ
స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు
నరనాయక యతని నూఱునారాచములన్. 341

తే. అతఁడు నొచ్చియు నాఁటించె నైదుతూపు
లింద్రసుతుఫాలమునఁ నాతఁ డేచి విల్లు
దునిమి పెల్లేయఁ దలఁకక దుస్ససేనుఁ
డన్యధనువున నిరువదేనమ్ము లేసె. 342

క. ఆతూపులు నఱికి పరి
స్ఫీతం బగు నారసంబు పృథుతరవక్ష
స్స్యూతంబు సేసి విజయుఁడు
నీతనయుని మూర్ఛ వుచ్చె నిష్ఠురవృత్తిన్. 343

వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 344

క. సారథి యరదము భీష్ముని
తేరి వెనుక కెగిచె నంతఁ దెలివొంది ధృతి
స్ఫారుఁ డగు నీకుమారుఁ డు
దారగతిన్ మగిడి వచ్చి తాఁకెం గ్రీడిన్. 345

వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగదత్తులును నభిమన్యుతో సుదక్షిణుండును విరాట్ద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుండును నకులునితో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుం

డును భీమసేనుతో భూరిశ్రవసుండును జేకితానుతోఁ జిత్రసేనుండును ధర్మనందనుతో నస్త్రగురుండును దలపడిన జెట్టిదం బగు బవరం బయ్యె నం దిరుదెఱంగుల యోధులు నన్యోన్యధ్వజభంజనంబును బరస్పర తురగహననంబును నితరేతర సూతనిపాతనంబును మిథఃకోదండఖండనంబును జేయుచుండం బటుతరశరసంపాతసంపాదితశంపాజాలకాభీలంబును భీషణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసారఘోరంబును నగు నపూర్వపర్జన్యసమయంబు దోఁచె నప్పుడు గయ్యంబుకల రూపంతయుం గనుంగొనుటకు మింటిక్రేవ నున్న వెరవు గాదను పరుసున సవిత్రుండు నగమింటికిం జనుదెంచె నట్టియెడ. 346

మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు
త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచున్ గాండీవి పెల్లేయుడుం
ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు నిర్లూనాఖిలాంగుండు నై
రటదశ్వం బగు తేరితో నతఁడు సంత్రాసంబునం బాఱెనన్. 347

తే. ఫల్గునుఁడు భీష్మముందటిబలము నెల్లఁ
జటులరథవల్గనుం డయి చంపుచున్నఁ
జూచి ద్రోణుండు గుణరవస్ఫురణఘూర్ణ
రోదసీభాగుఁ డగుచు మార్కొనఁ గడంగి. 348

ద్రోణాచార్యు లశ్వత్థామను భీష్మునకు సహాయముగాఁ బంపుట

సం. 6-108-1

వ. అక్కడ నడచినం గౌంతేయాగ్రజుండు తోడన తవిలి సేనాసమేతంబుగా నడ్డపడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు. 349

క. అప్పుడు క్రోధమునం గను
నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడ మై
యొప్పినతనయున కిట్లని
చెప్పెం దత్కాలగతివిశేషము లెల్లన్. 350

చ. తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రము దప్పెడుం గడు
న్వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు వీ
డ్వడియెడుఁ జెయ్వు లంగము గడంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువం బని బుద్ధి జనించెఁ బుత్రకా. 351

వ. అతనిమును మఱు తల యెత్తి చూడుము. 352

క. కూలెడు గుఱ్ఱంబులు ధర
వ్రాలెడు నేనుఁగులుఁ గెడయు రథములు నై యా
భీలయుగాంతసముద్భట
కాలపురోభాగరేఖ గానఁగ నయ్యెన్. 353

వ. అదియునుం గాక. 354

తే. అడరి కురుసేనపై గ్రద్ద లాడఁ జొచ్చెఁ
బడుచునున్నవి యుల్క లిక్కడ వినంగ
వచ్చె నతిరూక్షభంగి శివారుతంబు
లాపగానందనునకుఁ గీ డావహిల్లు. 355

వ. యుధిష్ఠిరు మొగంబునం గ్రోధం బగ్గలం బై తోఁచుచున్నయది ద్రౌప
దేయ నకుల సహదేవసహితుం డయి తఱుము నతని మిగిలి నాకు
రా రాదు నీవు దేవవ్రతుపాలిం బోయి యతని దాపట వలపటం
బ్రాపై నిలువు మిది ప్రాణంబులు డాఁచు సమయంబు గా దని పలికి
పనిచిన నశ్వత్థామ యుద్దామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 356

క. నరుఁ డేచి శిఖండిఁ బుర
స్సరుగాఁ గొని యపుడు భీష్మునమయింపఁగ స
త్వరుఁ డగుటకుఁ దగ రణత
త్పరుఁ డై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్. 357

వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబులం బారిసమరం బొడంగిన
భగదత్తకృపకృతవర్మశల్యసైంధవచిత్రసేన దుర్మర్షణవిందానువింద

వికర్ణుబు పదుండ్రుడు నొక్కపెట్ట భీమునిం బొదివి నానాస్త్రసంతానం
బుల నొప్పించిన నొచ్చియుం జలింపక పోరు నమ్మారుతిం గనుఁగొని
క్రీడి తోడై తఱియ నుఱికి ధనువుల తునియలను బాణంబుల పఱియలను
గేతుచ్ఛత్త్రిచామరంబుల చెక్కలను భూషణంబులపొళ్లను బుడమిం
గప్పినం జూచి సుయోధనుండు సుశర్మాదిభూపాలకుల నాలోకించి
యా భీమార్జునులం దాఁక నియోగించిన. 358

క. ముందటిపదుండ్రుడు నాన్నృపు
లందఱునుం గూడి పెనఁగి యయ్యిరువురచే
తం దూలపోవఁ జొచ్చినఁ
గ్రందుగ బలుమొనల నెల్లఁ గవియం బనిచెన్. 359

వ. ఇవ్విధంబున బెక్కుమొనలు పయింబడిన నయ్యిరువురకుఁ బోరు
భరం బగుట యెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖు లగు రథికజనంబులు
సైన్యోపేతంబుగాఁ డ్రోచి యేచిన. 360

క. పాండవబలములయత్యు
ద్దండపరాక్రమము సూచి దర్పోద్ధతవే
దండములఁ గనిన కేసరి
చండత భీష్ముండు వొదివె శరనఖరములన్. 361

క. డొల్లెడుసూతులుఁ బెలుచం
ద్రెళ్లెడు తురగములుఁగా నతిక్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ
నెల్లెడలం దాన యగుచు నేత్తెఱఁ బొదివెన్. 362

వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మ
గతంబున. 363

తే. ఉత్తమక్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి
నేఁడు పదినాళ్లగోలె నానిశితశరచ
యములఁ గూల్చితి వేసరినట్టు లయ్యె
మేనితోడి పొత్తిం కిట మాను టొప్పు. 364

వ. అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబు సేయు చందంబునం గౌంతేయాగ్రజుం గదిసి యల్లన యతనితో ని ట్లనియె.

క. జనియించినంతనుండియు
జనతతులం గ్రూరవృత్తిఁ జంపుచునుండం
జనియెం గాలము విసివితి
ననఘా యే నింకఁ జాల నాసురవిధికిన్. 366

ఆ. మీరు నాహితంబు గోరుదురేని శి
ఖండి మున్నుగాఁగఁ గడఁగి యంత
పట్టువారు నొక్కపెట్టగాఁ బైఁబడి
యేయుఁ డింకఁ దడవు సేయవలదు. 367

వ. అని పలికి సమరప్రకారంబునం దేరు గ్రేల్లు దోలి పాంచాలబలంబుల పయి నడరె నప్పు డజాతశత్రుండు సమీపవర్తి యగు ధృష్టద్యుమ్ను నాలోకించి. 368

క. దేవవ్రతుపలుకులు విం
టే వేగమ పనుపు మొక్కటిఁగఁ దఱుమఁగ యో
ధావళి నెల్లను భీముఁడు
నీవును నరుతోడఁ గూడి నిగుడుఁడు పెలుచన్. 369

వ. అనవుడు నతండు 370

సీ. మాత్స్యకైకేయాది మనుజేంద్రులకుఁ జేయఁ
గలయట్టి యోధవీరులకుఁ జేయి
సూపి మరున్నదీసూనుపైఁ గవియింప
బవనజపార్థుల ప్రాపుకలిమి
వెఱ పేది యందఱుఁ దఱుమఁ గౌరవపతి
తమ్ములు దొరలును దానుఁ దాతఁ
గడచి తాఁకినఁ బోరు ఘన మయ్యె నప్పుడు
సౌభద్రుఁ డమ్మహీశ్వరుని నొంచె

తే. ద్రోణతనయుండు శైనేయు బాణమయశ
రీరుఁ గావించెఁ జేదీశ పౌరవు లస
మాన విక్రము లై యొప్ప మారుతాత్మ
జుండు రారాజు సేనికపిండుఁ జదిపె. 371

వ. మఱియు నందు నిందును మందాకినీనందనుపయిం ద్రోవను నతనిం గావను గడంగిన సైనికు లనేకులు నానాప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగుచుండ 372

క. మొనసి మృగేంద్రు మృగేంద్రుఁడు
చెనయంజను పగిది నరుఁడు శీఘ్రగతిఁ శాం
తనవుపయిఁ గవియ దుశ్శా
సనుఁ డడ్డము సొచ్చె దేవసంఘము వొగడన్. 373

ఆ. అతని కప్పు డెదుర నమ్మొన నెవ్వరుఁ
జాల రైరి సవ్యసాచి యొకఁడ
నిశితవిశిఖపంక్తి నిగిడించి నొప్పించి
యొత్తి భీష్ము వెనుక కొదుఁగఁ జేసె 374

వ. తదవసరంబున సరభసంబున. 375

క. భగదత్తుని నాకవ్వడి
వెగడొందఁగఁ జేసి యతని వెల్లెనుఁగుఁ గెం
పుగఁ జేసిన నాతండును
నిగిడెం బాంచాలమేదినీపతిమీఁదన్. 376

వ. ఆఖండలనందనుండును శిఖండిం దఱిమి తెఱపి సూపి దేవవ్రతునేయు మని పురికొలిపె నంత. 377

క. మనయోధప్రకరము శాం
తనవుం దలకడచి యత్యుదగ్రత నయ్యు
ర్జునుఁ బొదివె నతం డలిగినఁ
బెనుగాలిం దూలు మొగిలిపిండును బోలెన్. 378

వ. (తూలె) నట్లు దూలిన. 379

ఆ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద
వాలుఁటమ్ము లేయ వాని నేయ
నొల్ల కతఁడు గెలని యోధవీరావళి
నేయుచుండె శౌర్య మెసఁక మెసఁగ. 380

క. నరుఁడు శిఖండిం దఱిమిన
శరము లతఁడు భీష్మునుర భుజామధ్యమునం
గురియఁగ నవ్వుచు నుండెం
గరి యంత్రజలంబు దొరఁగఁగా నున్నక్రియన్. 381

వ ఇట్లు దేవవ్రతుండు శిఖండి యేయుట సరకుసేయక యతం డగ్గ మైన నేయక సాయకంబులు సవ్యసాచిపయి నిగిడింప మగిడి దుశ్శాసనుండు గడంగి కవ్వడి వెగడుపడునంత కయ్యంబు సేసి నొచ్చి పాసినం గౌరవపతి గనుంగొని యెలుంగు సూపి చేయి వీచి పురికొల్పినం గళింగ మాళవబాహ్లికవిదేహశూరసేనప్రముఖబలంబులు జలమర్దనుతనయు దెసకుం గవిసిన. 382

తే. అతడు దివ్యాస్త్రజాలంబు నతిశయంబు
సూపి చతురంగబలముల రూపు మాపి
యుఱక తఱిమి శిఖండికిఁ దెఱపి సూప
వాఁడితూపులు భీష్ముపై వాఁడు నినిచె 383

వ. ఆ సమయంబునం గృపశల్యవివింశతివికర్ణులం గూర్చికొని పేర్చి దుశ్శాసనుండు శాంతనవున కడ్డపడినం బార్థుం డయ్యేవురను విరథులం జేసిన. 384

క. కురుపతియు ననుజవర్గముఁ
బరమక్రోధమునఁ దెంపు బలుపును మెఱయన్
సురనాథనందనునిపై
నురవడిఁ ద్రోచుటయు సేన లుగ్రత నడరెన్. 385

క. పాండవబలములు దలపడి
ఖండనమొనరింప నగ్రభాగంబున ను
ద్దండతఁ బోరెడు మనుమల
తండము గని మెచ్చి యప్పితామహుఁడు వెసన్. 386

తే. అరిబలంబుపై నొక్క దివ్యాస్త్ర మేయఁ
దలఁచి యరిఁ బోసి తిగిచి యుదగ్రవృత్తిఁ
గవిసి ముందట నున్న శిఖండిచూడ్కిఁ
దొడరుటయుఁ దాల్మిమైఁ దెగ యుడిపె నధిప. 387

వ. అంత. 388

క. సోమకమాత్స్యప్రముఖో
ద్దామ బలము లేచి పెలుచఁ దఱుముటయును సం
గ్రామతలము సేనాంగ
స్తోమాంగమయంబు సేసె దుర్దాంతగతిన్. 389

క. సేనల నిమ్మెయి భీష్ముఁడు
దీనతఁ బొందింప నలిగి ధీరత్వము వీ
రానీకం బగ్గింప శ
తానీకుఁ డెదిర్చె నతని నాసురభంగిన్. 390

విరటుతమ్ముఁ డగు శతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట

సం. 6-113-24

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాలమ్ముల నొప్పించినం గోపించి. 391

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులం
డొల్లం దీవ్రత సేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమియాభీలద్యుతిప్రస్ఫుర
ద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్. 392

వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన. 393

క. మొన లెల్ల విఱుగ మధ్యం
దినమున యినుమాడ్కి బయలఁ దేజోనిధి శం
తనుసూను డొప్పె నప్పుడు
గనుఁగొని యి ట్లనియె శౌరి గాండివితోడన్. 394

క. మన మోహారములు సెడి కను
కనిఁ బాఱెడు నిప్పు డాపగాసుతునకు గ్ర
క్కున నీవు మార్కొనక త
క్కినఁ గార్యము దప్పుఁ బోదివి గెలువుము కడఁకన్. 395

వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీనందను నమందమార్గణపుంజంబునం బొదివె శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు వాని నేయనొల్లని సందున నాసవ్యసాచి యతని విల్లు దునిమి వ్రేల్లేయుచున్నం జూచి సైరింపక శలశల్య కృపకృతవర్మచిత్రసేనభూరిశ్రవఃప్రభృతివీరలోకం బతిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు నేయుచు భీష్మున కడ్డపడుండు దలకడవుం డను నెలుఁగులు నింగిముట్ట బలసమేతంబుగా నడరినం గని సమీరనందనసాత్యకిసౌభద్రవిరాటద్రుపదఘటోత్కచప్రముఖ యోధ వర్గం బనర్గళభంగిం దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమయసమరం బయ్యె నందుఁ బురందర నంద నుండు మన సైనికుల కందఱ కన్నిరూపు లయి యైంద్రవారుణా గ్నేయాది మహాశరంబులం దెరల్చుచు సురతటినీతనయుం డైన శిఖండిం బురి కొల్పికొని మీ తండ్రి నేయించుచు నతం డెన్ని వింట్లెత్తిన నన్నింటిం దోడ్తోన తునుమాడుచుండె నాగ్రిడిపై నతం డుగ్రశక్తి నుపయోగింప నదియునుం ద్రుంచి సూతునిం గేతనంబునుం గూల్చిన. 393

సీ. మనమున భీష్ముఁ డి ట్లని వితర్కించుఁ బాం
డవుల నాయొక్క వింటన కడంగి
గెలువనే వీరిఁ గృష్ణుండు ప్రాపు గా
కున్న నిం కది యట్టు లుండనిమ్ము

కృష్ణుఁ దోడుగ గొని కిడ్వడి వీరలు
వచ్చినఁ జెప్పితి వధవిధంబు
సమర ముపేక్షించి శాంతిమై నుండెద
నడచిపా ఁటెటికి ననఁగ నెఱిఁగి

తే. చదల సుర లిట్లు మే లిది సమ్మతంబు
మాకు నని ప్రీతిమైఁ జెప్పుమాట లాతఁ
డొక్కరుండును వినియె నేనొకఁడు వింటి
మునిమహానుభావంబున మనుజనాథ. 397

వ. తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరంబగు మారుతంబు మరుత్తటినీ
తనయుమీఁద నుడిసె సురదుందుభులు మ్రోసెఁ గుసుమవర్షంబులు
గురిసె నవియు నన్యగోచరంబు లయ్యె నిట్లు నిశ్చయించియు నమ్మ
హాత్ముం డూరకున్న గెలని కొకభంగియై తోఁచు నని తలంచి. 398

తే. ఒక్కవి ల్లెక్కుపెట్టంగ నుఱక వెస శి
ఖండి పటుమార్గణంబులఁ గడఁగి యేయ
నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి
పఱపెఁ దనయమ్ము లతనిపై ఫల్గునుండు. 399

వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 400

క. నరుఁడు దనమీఁదఁ దొరఁగెడు
శరములు వారించి యతని చాపం బధిక
త్వరితగతిఁ ద్రుంచి యతిని
ష్ఠురనారాచంబు దనువు సొర నేయుటయున్. 401

వ. తమకుం దమయోధవరులకును వారింపం జేరం జెనయం గొలఁది
కాక వెల్లివిరిసిన శరనిధిభంగిం బొంగినవివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం
దమ్ము విడువక కెలంకుల నున్న నీకొడుకులం గలయం గనుగొని మీ
తండ్రి రారాజుతో నిట్లనియె. 402

మ. అని దేవాసురకోటి కైనను నశక్యం బిమ్మహావీరు మా
ర్కొనగ వీఁ డగ్గిన మర్త్యు లేయెదు రుదారుం డైన యాక్రీడి ద
క్కిన నిప్పాండవసైన్య మింతయును బ్రమ్మగ్గింపంగ నేఁ జాలుదున్
విను సత్యం బిది వీనివింటి కెదురున్ వి ల్లెత్తలేఁ డెవ్వఁడున్. 403

క. అనునెడ శిఖండిచాపము
వెనుకం దనవిల్లు నిల్పి వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను
జననాయక దొడ్డనారసంబుల భీష్మున్. 404

వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి. 405

సీ. అశనికల్పము లివి యర్జును బాణముల్
గాని శిఖండివి గావు సుమ్ము
కర్కటిగర్భంబు కరణి గాత్రము వ్రచ్చె
నిట్టివి వీనికి నెందుఁ గలవు
బ్రహ్మదండంబులపాటి వై మర్మంబు
లిట్లు నొనాఁటునే యితనిచేత
జముదూత లట్ల ప్రాణముల వెలార్పంగ
నీ ద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె
ఆ. దృఢవిముక్తములును దీప్తాకృతులు లత్య
శుద్ధిమంతములును సునిశితములు
సైననారసంబు లతనివి గాక యీ
తనివి యగునె యెవ్విధమునఁ జూడ. 406

క. అనుచుఁ బటుశక్తి నప్పా
ర్థుని వైచిన నది యతండు తునుమాడుచు శాం
తనవుఁడు వాలుం బలకయుఁ
గొని యరదము డిగ్గిఁ జూచుకొలఁదిం బెలుచన్. 407

తే. ఏసి యారెంటిఁ దునియలు చేసి యెలుఁగు
సూపి యే నుండ వెఱపేల నాపగాత
నూజుఁ బొదువుఁడు మీ రని యోజఁ జెప్పె
శక్రతనయుండు తనయోధజనుల కెల్ల. 408

వ. అప్పలుకు లాకర్ణించి. 409

క. ఏయుఁడు పొడువుం డడవుఁడు
వ్రేయుఁ డనుచు వారు జాహ్నవీతనయుఁ గడున్
డాయుడు మనసై నికులుం
గో యని తలపడ్డఁ బోరు ఘోరం బయ్యెన్. 410

వ. అప్పుడు. 411

తే. ఏసి గాండీవి కురుసేన నెగువ నతని
వారు వెఱువక భీష్మునిఁ జేరి యొడల
వ్రేలఁ డెడ లేనియట్లుగ వివిధభంగి
నిష్ఠురాస్త్రశస్త్రంబుల నినిచి రధిప. 412

భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట

వ. అంత నంశుమంతుండు శాంతుం డగుచు వచ్చె నట్టియెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడం ద్రోచిన. 413

క. తూర్పుతల గాఁగ నీసుతు
లేర్పడఁ గనుఁగొనుచు నుండ నిల కంపింపన్
దర్పోజ్జ్వలుఁ డా భీష్ముఁ డ
హర్పతి యస్తాద్రి చేరునట్లుగఁ బడియెన్. 414

తే. తనువు ధరఁ బొందకుండఁగఁ దల్పభంగి
శరము లూఁతయై పొలుపారె నరవరేణ్య
యట్లు శరతల్పగతుఁ డగు నమ్మహాను
భావు దేవవ్రతుని దేవభావ మొందె. 415

చ. అనిమిషు లప్డుచూఁచి మృతుఁ డయ్యెడు నక్కట దక్షిణాయనం
బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ బొందిన భీష్ముఁ డెఱింగి వారి కి
ట్లను సురలార కాలగతి నాత్మఁ దలంచియ కాదె మేనిలో
నునిచినవాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁ డించుకేనియున్. 416

వ. సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రి మెచ్చి యవధ్యత్వంబును స్వచ్ఛందమరణంబును నిచ్చినవాఁడు కావునఁ దద్వరప్రభావంబున

నావధంబున కే నోడంబడక కానేర దయ్యెఁ బ్రాణంబులు నావశంబ
యనిన విని వారలు సంతోషించి రాసమయంబున భాగీరథిపనుపునం
గొందఱు మునివరులు హంసరూపంబుల నమ్మహాత్మునకు దక్షిణా
యనం బెఱింగింపం జనుదెంచి యతండు తెలిసియునికి నతనిచేత
నెఱింగి ప్రియం బంది యేగి రట్టియెడ దుర్యోధనుండు పుచ్చిన
దుశ్శాసనుండు కుంభసంభవుపాలికిం బోయి భీష్ముపాటు చెప్పిన
నతండు మూర్ఛిల్లి యొక్కింత తేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథు
కడకుం జనియె నయ్యవసరంబున. 417

సీ. పాండవేయులు మాత్స్యపాంచాలయాదవ
సహితంబుగా సంతసమునఁ బొదలి
రాదెస బొబ్బలు నార్పులు బహుతూర్య
కోటియుఁ జెలఁగె నీకొడుకుగమియు
నీదిక్కుదొరలును నెలుగెత్తి యేడ్వంగ
నంబరచరుల హాహారవంబు
లులియంగ రోదసి గలయంతవట్టును
ఘనశబ్దమయ మయ్యె మనుజనాథ

తే. కాలు సేయాడ్పుటలు లేక కన్నుఁగవల
నశ్రు లొలుకంగఁ జిత్తంబు లడఁల బాండు
సూనుతతిఁ జూచుచుండిరి కాని యించు
కయును గడఁగరు మనవారు కయ్యమునకు. 418

వ. తదవసరంబున నంబరమణి యపరరత్నాకరంబు సొచ్చె ననిన విని
ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 419

క. నాయుల్ల మరయ నినుమో
దాయె నా కిట్లు రూపఱక విన నోర్చెన్
సాయకసముదయఖరభవ
దీయవచనచయము గవియుదేరం దిరమై. 420

వ. ఇంక నేమేనియుం జెప్పఁ గొఱంతకలదే యనుటయు నాసూతనంద
నుం డిట్లను నప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు
లూడ్చి యాయుధంబులు పెట్టి గాంగేయుకడకుం బోయిరి కౌంతే
యులు నట బంధుమిత్రసహితు లయి యచటికిం జనిరి ధనంజయుం

డొక్కరుండును ధనుష్పాణి యై యరిగె నిట్లు య్యిరుదెఱంగుల వార లుం దత్కాలప్రశాంతస్వాంతు లై యన్యోన్యవిషయరోషంబులు దక్కి తన్నుం బరివేష్టించినం గుఱుగురుం డగు నమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించికొని యుండె. 421

తే. తనకుఁ గ్రిందల యని భవత్తనయులకు నె
ఱుంగఁ జెప్పిన వారు కడంగి మెత్తఁ
దనము గల తలగడలు దేఁ బనుచుటయును
జూచి చిఱునవ్వుతో సవ్యసాచిఁ బిలిచె. 422

క. పిలుచుటయు నతఁడు బాష్పము
లొలుకఁగ గాండివము పెట్టి యొయ్యన చనినం
దలగడతూపులు సెజ్జకు
నలవడఁ బెట్టు మని భీష్ముఁ డాతనిఁ బనిచెన్. 423

వ. ఇట్లు పనిచినం బార్థుం డట్ల చేయుదు నని గాండివంబు పుచ్చికొని మఱియు ననుజ్ఞ గొని మూఁడువాలమ్ము లభిమంత్రించి పెడతలఁ దాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచి నిలుచునట్లుగా నేసినం దాత ప్రీతుండై తల్పంబునకుం దగిన యుపధానంబు పెట్టి తని యతనిం గొనియాడి సకలపౌత్రులను ధాత్రీపతులను నవలోకించి. 424

క. రవిఁ గొల్చి యుత్తరాయణ
మవునంతకు నంపపాన్పునం దిట్లు మహో
త్సవలీల నిలుతు నా కీ
దివసంబులఁ జేయవలయుఁ దృఢరక్ష తగన్. 425

క. అలయ కరయ నోపినవా
రలు గ్రక్కునఁ బరిఘుతోడిప్రాకారం బి
ట్టలముగఁ గావింపుఁ డనుడుఁ
దలకొని నీసుతులుఁ బాండుతనయులు భక్తిన్. 426

వ. అత్తెఱం గాచరింపనుం దాత్పర్యంబున రక్షింపనుం దమతమయందుఁ దగిన వారల నియోగించి రంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స చేసెద మని తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి

వీడుకొల్పి గీతవాద్యనృత్తప్రవీణంబు లగు పాత్రంబు లమ్మహాత్మునకు వినోదంబు సలుపుచుండె నట్టియెడ నా దేవవ్రతుండు నీళ్లు ద్రావ నడిగినం దనుపారునీ రనేకులు కొనివచ్చిన నతండు. 427

తే. విను(డు శరతల్పగతుఁడ నై యునికిఁ జేసి
యన్యసలిలంబు సేవింప ననుచితంబు
నాకుఁ దేజోమయాస్త్రవిన్యాసవిధిఁ బ
ముత్థితం బైన భూజల మొకఁడు దక్క. 428

వ. అనుటయుఁ గౌరవులును వెఱఁగుపడి యున్నం గవ్వడిం గనుంగొని గాంగేయుండు. 429

క. శరవేదన సర్వాంగము
నెరియఁగ నా కిపుడు పెదవు లెండెడుఁ దృష్ణా
భర ముడుపఁ దగిన నీళులు
వెరవునఁ దేనేర్తు వీవ వేతె మ్మనఘా. 430

వ. అనిన నట్లకాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు చేసి తేజోమయం బయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబుఁ గావించి మహీత లంబు గాఁడ నేసిన భాసురచ్ఛాయం బగు తోయంబు ధారారూపంబున దివ్యగంధరసోపేతం బయి యెగసిన. 431

ఆ. కౌరవులు ప్రకంపగాఢవిస్మయు లైరి
పాండుసుతులు వారిబలము నుబ్బి
యార్చి సంకు లొత్తి రాజలంబుల నమ్మ
హాత్ముఁ దృప్తుఁ జేసె నర్జునుండు. 432

వ. ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీనందనుండు పురందరనందనున కి ట్లనియె. 433

ఉ. నారదుచేత నిన్ను మునినాథునిఁ గాఁగ నెఱింగి యుండుదున్
శౌరియు నీవుఁ గూడిన నసాధ్యము లెవ్వియు లేవు దర్పదు
ర్వారుఁడ వైన నీవలని వైరము కీడని చెప్పఁ జెప్ప నీ
కౌరవరాజు మానఁడు తెగం జెడుఁ గా కిట మీఁద భీముచేన్. 434

వ. అని పలికి దీనమానసుం డగు చున్న భవత్సూనుతో నిట్లనియె. 435

మ. నరుఁ డత్యద్భుతవిక్రముం డతని కా నారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింపరాదు సమరావష్టంభముం దక్కి ధ

ర్మరతుం డైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్ధరా
జర్యమం బొందుము మీరు కొంద అయినం జాకున్న నీకొప్పదే. 436

వ. అని పలికి యూరకుండినం గౌరవపాండవులును మాఱు పలుకక యతనికి నమస్కరించి నిజనివాసంబులకుం జని రట్లు చనునెడ గోవిందుండు కౌంతేయాగ్రజుం గనుంగొని 437

క. సురలకు నజయ్యుఁ డగునీ
సురసరిదాత్మజుని గెలువఁ జొప్పడునే యె
వ్వరి కైన నద్భుతావహ
పరికరు లగుమీకుఁ దక్కఁ బౌరవముఖ్యా. 438

క. అనుటయు నతఁ డిట్లను నే
మనఁగా నొకమానిసులమె యప్రతిహతవీ
రుని నిన్నుఁ బడసి యింతటి
పనులకుఁ జాలితిమి గాక భక్తాధీనా. 439

కర్ణుఁడు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట

వ. అని యి ట్లయ్యిరువురు నొండొరులం బ్రశంసించుచు నఖిలజనపరివృతు లై శిబిరంబుల కరిగిరి తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తివినయంబులు తోఁపం బాదప్రణామం బాచరించి. 440

ఆ. అలుక తక్కి నన్ను నధికవాత్సల్యశీ
తలము గాఁగఁ జూచి తగినమాట
లాడవే మహాత్మ యనుటయు నాతండు
గారవమున నతనిఁ జేరఁ బిలిచి. 441

వ. ఒక్క కరంబు మలంచి కౌఁగిలించుకొని యచ్చట నున్న రక్షకాది జనంబుల నవులం బోవం బనిచి యతనితో ని ట్లనియె. 442

క. నీదెసఁ గోపింతునె కుల
భేదముగాఁ బలుకుటయును బిడ్డల చెఱుపం
గా దని కినియుదు లే దన
రా దలఁతును నిన్ను నిష్ఠురంపుఁ బలుకులన్. 443

వ. అది శిక్ష గాని రోషంబు గా దట్లుం గాక. 444

క. నీయుదయము దైవికగ
ర్భాయత్తము నీకు మర్త్యు లసదృశులు కాం
తేయుఁడవు కాని విను రా
ధేయుండవు కావు నీవు ధీరవిచారా. 445

వ. ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె నేనును భవదీయ తేజోవిశేషంబుఁ గలననుం గనుంగొనియుండుదుఁ బాండుతనయుండ వగుటం జేసి నీయెడ వాత్సల్యంబ కాని మాత్సర్యంబు లే దొక్కటి చెప్పెద విను మేను గురుపాండవుల వైరంబుడిపి పుచ్చితి నప్పాండవేయు లజయ్యు లప్రమేయుం డగు కృష్ణుండు వారికి విధేయుండు కావున వారలతోడివిరోధం బొప్పదు నీవును నొండుదలంపు దక్కి యక్కౌంతేయులం గలిసి యుండు మనినఁ గర్ణుం డతని కి ట్లనియె. 446

క. కౌంతేయుండ నగుదు నిది
యంతయుఁ దొల్లియును వింటి నార్యులచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ
సంతానము తోడిపొత్తు చనునే నాకున్. 447

ఉ. వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలన్
బోర జయింపరామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు చేయు తగుమన్నన లెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక యే విడిచి పోవుట ధర్మమె వీరకర్మమే. 448

వ. అదియునుం గాక. 449

ఉ. మాటలు పెక్కులాడి యనుమానము లేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ బలంబునఁ బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యేబలువు చేసితి వైరము నాకు నింక నీ
పీటికి వారిపీటికిని పెక్కసమయ్యెడు కయ్య మొప్పగున్. 450

శా. దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపఁగా వచ్చునే
నీ వింకన్ నను నొండు పల్కక పరానీకంబుపైఁ బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబునం
భావింపఁగ విహరించెదన్ మురరిపుం బార్థుం దలంకించెదన్. 451

చ. అన విని భీష్ముఁ డిట్టు లను నంతకుఁ జాలు దెలుంగనే సుయో
ధనునకు నెప్డు నీదుభుజదర్పమ కాదె సహాయ మెద్ది యా
తనికిఁ బ్రియంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున సంతసిల్లు మనుమానము దక్కఁ మనుజ్ఞ యిచ్చితిన్. 452

వ. అని తెలి వొంది పలికిన దేవవ్రతుబంధుభావంబునకుం బరమానందంబు
నొంది రాధేయుండును నిజనివాసంబునకుం జనియె నని సంజయుండు
ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుండు
చెప్పుటయు. 453

ఉ. మర్దితతాపసంకలనమంజులనామ దురంతదుర్దశా
కర్దమలేపనిర్హరణకారికృపామృతపూరకర్మసం
మర్దనిరాసకర్మఠ సమత్వపరిస్ఫుటరూపభావనా
నిర్దళితారివర్గమహనీయ మహోరమణీయవైభవా. 454

క. భసితపరభాగవేలా
లసితశ్రీవత్సలలితలాంఛనపింఛ
ప్రసృమరరుచిశబలోరగ
విసృమరదీధితికలాపవేష్టిత మౌళీ. 455

మాలిని. తురణరహితవృత్తీ గ్రాహ్యభక్తిప్రవృత్తీ
కరణగమనలీలా గాఢకారుణ్యశీలా
స్మరణశుభదమూర్తీ మధ్యరశ్మిప్రవర్తీ
చరణవినమదింద్రా సంతతానందసాంద్రా. 456

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్రి
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన
శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు
సర్వంబును తృతీయాశ్వాసము.

శ్రీమదాంధ్రమహాభారతమునందలి భీష్మపర్వము సమాప్తము